# నౌరోజ్

గ్రంథకర్త :

వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావు

1-8-0 లు

# నౌరోజ్

## చరిత్రాత్మక విషాదాంత కావ్యము.

గ్రంథకర్త
వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావు
ప్రథానాంధ్రోపాధ్యాయుఁడు (రిటైర్డ్), మెక్లారిన్ హైస్కూలు, కాకినాడ.
&
ఆంధ్రాధ్యాపకుఁడు (Ex.) స్టెల్లామేరిస్ కాలేజ్, మైలాపూర్, మద్రాసు.

 1950. రు. 1-8-0

# మున్నుడి



నా జీవయాత్రలోని కొన్ని సంఘటనలచేత, నా హృదయ తంత్రులను విశేషముగా మ్రోగించునది కరుణరసమే యగుటచేతను, నా మనస్సు విషాదాంతగాథలవైపే అగ్గలముగా మ్రొగ్గుచుండును. ఆ కారణముననే నా రచనలు—'అనార్కలీ', 'స్లీవాంకము', 'గోపదంపతులు' మున్నగునవి—విషాదాంతములుగానే వెలువఱిచితిని. నటకునిగా, నాటకకర్తనుగా నాకున్న యనుభవమునుబట్టి విషాదాంతగాథలు అమితతీవ్రముగా, అత్యంతత్వరితముగా ప్రజల చిత్తముల నత్తుకొని రససిద్ధి చేకూర్చునని నా విశ్వాసము. ఆ విశ్వాసమే యీ 'నౌరోజ్' కావ్యరచనకు నన్నుఁ బ్రేరేచినది.

**1945**, మేనెలలో నాకాలు విఱిఁగి, నాలుగైదు మాసాలు మంచానఁబడి యుండవలసి వచ్చినది. నా మానస ప్రవృత్తికి అప్పటి నా దేహసంస్థితి తోడగుటచే, ఈ 'నౌరోజ్' కావ్యరచన మారంభించితిని. ఇందలి కథ విశేషభాగము చరిత్రాత్మకమే. కథాకాలమునాఁటికి షాజహాన్‌చక్రవర్తి **41** యేండ్ల వయస్సువాఁడు. అప్పటి కతనికి నిలిచియున్న సంతానము నలుగురు కొడుకులు, నలువురు కూఁతులును. ధీరోదాత్తుఁడై, యేకపత్నీవ్రతనియమమందున్న ఆ సార్వభౌముఁడు అపూర్వ సౌందర్యవతియైన జిన్నత్బేగమును చూచినంతనే సంచలిత మనస్కుఁడై వ్రతభంగ మొనరించుకొన్నాఁడు, ఉత్తమనాయక స్థానమునుండి యొక మెట్టు క్రిందికి దిగినాఁడు. కాని అతని అదృష్టమువలన లభించిన ఆ ద్వితీయకళత్ర మెంతటి సుందరాంగియో అంతటి అకల్మష చరిత్ర, వెదకినను లోపము కనుపింపనిది, రాణివాసపుకుట్ర లెఱుఁగని అమాయిక. పట్టమహిషియు, ఉదారస్వభావయు నైన మమ్తాజి బేగమునకు జిన్నత్తనిన జాలియేకాని, సపత్నీమాత్సర్య మేకోశములోను లేదు. కాని దానిని గ్రహింపక అసూయాపరలై నైజముగా దుస్స్వభావలైన రోషనారా

మున్నగు అంతఃపురకాంతలకు, అంతగా చక్రవర్తి హృదయమును చూఱఁగొన్న జిన్నత్తు వునుగడ, కన్నెఱ్ఱగా నుండెను. పెండ్లియై యొకయేఁడాది తిరుగులోపల నే నిర్దోషిణియైన ఆయువిద ఆయసూయాపరలు ఆకల్పించిన అపవాదములకు ఆహుతి కావలసివచ్చెను. వివేకనిధియని వన్నెకెక్కిన చక్రవర్తియే, న్యాయాన్యాయవిచక్షణ లేకుండ, చెప్పుడుమాటలు వినుటచేత, మహితసౌఖ్యస్థితి కర్వా తగల మానినీమణి, నవయువతీమతల్లి అనుచిత పతనము నందవలసి వచ్చినది. అరుణోదయమైన వెంటనే తదస్తమయమైన ట్లయినది. ఆమె అస్వాభావి కాకాల మరణము మొగల్ వంశ వినాశమునకు, మొగల్ సామ్రాజ్య పతనమునకు మూలబీజము నాఁటిన ట్లయినది. జిన్నత్ మరణించిన యొక సంవత్సరమునకే మమ్తాజి మృతిఁ జెందినది. షాజహాన్ జీవితమాధుర్యము క్షీణింప మొదలు పెట్టినది. కుటుంబములో సమైక్యస్థితి నశించి అంతర్యుద్ధ మారంభమైనది. తాను ప్రాణసమానముగాఁ జూచి ఆదరించిన జిన్నత్తును అతఁ డవిచారముగా బందిచేసినటులే, కన్నకొడుకులే అతనిని ఖైదుచేసిరి. సహజముగా ఉత్తమగుణుఁడైన షాజహాన్, జిన్నత్కాంత కొనరించిన అపచారమునకు పశ్చాత్తప్తుఁ డగుటఁ జేసి, క్షమార్హుఁడై నాఁడు. కాని పాపఫల మనుభవింపక యతనికిఁ దప్పినది కాదు.

ఈ రచనయందు కావ్య లక్షణమంతగా నేను బాటింపకుంటిని. కథా సందర్భానుసారముగా వచ్చిన వర్ణనములేగాని, పనిపట్టి కావ్యలక్షణము సాధించుటకై చేసిన వర్ణనములులేవు. ఆశ్వాసనియమములు సైత మనుసరింపకుంటిని. ఒక్కొక యభిప్రాయము ముగియునప్పటికి ఒక్కొక యధ్యాయమైనట్లు లెక్కించి, 12 అధ్యాయములుగా నాగ్రంథమును విభజించితిని. కృత్యాద్యవస్థకు నేను బాల్పడనేలేదు. శకటరేఫ సాధురేఫములకు యతిప్రాసములు, అర్థసౌలభ్యముకొఱకు వాక్యమధ్యమందు విసంధియు, అఖండయతిప్రయోగమును బాహాటముగా చేసితిని. కథాకాలమునుబట్టి ఆవాతావరణము స్ఫురింపఁ జేయుటకు పరభాషా పదములు విరివిగా వాడితిని. నౌరోజుత్సవము, స్వర్ణ యుగము, షాజహాన్ రూపము, అతని దిన చర్య, దర్బారు

మొదలైనవి వర్ణించునపుడు చరిత్రకు సంపూర్ణముగాఁ గట్టుపడియే యుంటిని. జిన్నత్తునకుఁ బంపఁబడిన పెండ్లి సారెను వివరించుపట్ల, అహమ్మదునగరము నుండి వచ్చిన దూతల చర్యను విశదపఱచుపట్ల, మహమ్మదీయ సంప్రదాయములు, మొగల్ సభా మర్యాదలఁను వ్యక్తపఱచితిని. జిన్నత్తును చిన్ననాఁటి నుండి ప్రేమించి, విఫల మనోరథుఁడైన గుల్జారుయొక్క భూమికను నిర్వహించునపుడు రసపోషణకై కొన్ని కల్పనలు చేసితిని. రోషనారాచేటికయగు ఫతీమా యితివృత్తపోషణకై కల్పింపఁబడిన పాత్ర. కథ నేకరువుపెట్టుటలో వచనరూపాన చెప్పఁదగిన యంశములుకూడ సులభశైలిని పద్యములుగానే రచియించితిని. కథ నౌరోజుత్సవములలో ప్రారంభమై, మరుచటి సంవత్సరమా యుత్సవములలోనే ముగియుటచేత, నా కావ్యమునకు 'నౌరోజ్' అని పేరు పెట్టితిని.

అగాధ విషాదాంత గాథలకు, అనంత సుఖాంత గాథలకును సన్నిహిత భావము విశేషము. ఉదాత్తమైన విషాదాంత కథను పఠించినను, తిలకించినను, ఆత్మ క్షాళితమై శుద్ధి పొందిన భావము స్ఫురింపక మానదు. మన కాదర్శములైన ఆదిగ్రంథములు, భారత రామాయణాదులు, నిజముగా గొప్ప విషాదాంత కథలే. సీతాదేవి భూగర్భమునకు నిష్క్రమించుట, శ్రీరాముఁడు సరయూనదియం దైక్యమొందుట, పాండవుల మహాప్రస్థానము, శ్రీకృష్ణ నిర్యాణానంతరము ద్వారకానగరము సముద్రమగ్నమగుట, ఇత్యాది విషాద సంఘటనలు ప్రతిహృదయమును శోధించి, శుద్ధిపఱుపఁగలిగిన వగుటచేత, ఆ మహాగ్రంథములను ప్రజలు సుఖాంతములుగానే పరిగణించు చున్నారు. నా కావ్యనాయికయైన జిన్నత్ విషాధగాధకూడ పైగాథలవలెనే యుత్తమ శ్రేణికిఁజెందినదని నా నమ్మకము. ఇందలి సత్యాసత్యములు రసజ్ఞులైన పాఠకులే గ్రహింతురుగాక !

వింజమూరి వేంకట లక్ష్మీనరసింహారావు,
గ్రంథకర్త.

ఓమ్

# "నౌరోజ్"

౧

"అరరే! కింకర! ఆలతాంతతిలకం బత్యంత సౌందర్య బం
ధురమై నిర్మల మౌక్తిక ప్రతిమ కాంతు ల్దిక్కుల న్జిమ్ముచున్
బరమామోదముఁ గూర్చు; ఆ కుసుమ మేవం శౌనకుం జెందునో,
యరయం బో''మ్మనె షాజహాన్ ప్రభువరుం డాప్యాయనాలోకియై.

౨

"దొరవా రానతి యిత్తు రేని త్రుటిలోఁ ద్రుంపంగ నేర్తున్; ధరా
వరుపాదాల సలాము సేయ విరి నిల్పంజాలుదున్; వేతు దే
వరయాజ్ఞప్తి;" నటన్నఁ గింకరుని శాపాద్ధాహి, "నీమోటులా
కరముల్ కోమలపుష్పజాతులను దాఁకన్ రాదు" నాఁబల్కుచున్,

౩

ఒక దాసింగని, "యోసి! యా తెరువునం దొయ్యార మొప్పార హం
సికయట్టుల్ నడయాడు నాసరసిజాక్షిం జేరి యెవ్వాని పు
త్రికయో కాఁపుర మేడనో యరసి యే తెమ్మా" యటన్నన్ వికా
విక లంఘించి తటిల్లతోపమగతి న్వే పోయె నాపార్తియున్.

౪

అవి 'నవరోజు' నాఁబరఁగు నంచిత పర్వదినాలు, షాజహాన్
ధవళదుకూలగేహమున ధర్మసతీమణితోఁ బ్రియాత్మజా
ప్రవరలతో ననర్ఘమణి పంక్తి విరాజిత కాయమానమం
దవఘుళ మొందు మెత్తనగు నంచలతెక్కలసెజ్జ నొప్పుచున్.

౫

ఎదుటను బొల్చు పల్చనగు హేమమయోత్తమ జాలకంబునన్
విదితముగాఁగఁ దోఁచు బహువిశ్రుత రాజకుమారికామణీ
వదనములం గనుంగొనుచు వానిప్రశస్తిని మెచ్చు చాత్మ స
మ్ముదమొదవన్ మొగల్విభుఁడు ప్రొద్దును బుచ్చు వినోదలీలలన్

౬

అత్తఱి నుత్సవస్థల వియత్తల వీధి మెఱుంగుఁ దీఁగెనా
బిత్తరి యొర్తు నెచ్చెలులపిండను ఱిక్కలమధ్యమందుఁ బ
ర్వెత్తుచుఁ బోవుచుంటఁ గడువింతగఁ దోఁపఁగఁ గ్రొత్తచెల్వుచేఁ
జిత్తమునం గలంగి తనచెంత గులామునుగాంచి యట్లనెన్.

౭

మహిపీతల్లజ ముత్తమాశయయు నౌ మమ్తాజ మాహల్ మహా
మహిమాఢ్యుండగు నాత్మభర్త యటులమ్మాడ్కిం జలింపంగ దు
స్సహమై దౌత్యమెటు ల్ఫలించునొకొ, చాంచల్యంబు రారాజు ని
ర్వహణం బేవిధి మార్చునో, యనుచు దుర్వారాధినిం బొందఁగన్.

౮

దరహాసముతో నంతః
పురదాసి మరలఁగ వచ్చి భూపశ్రేష్ఠున్
దరిసి, "జహాపన! నే దే
వరయానతిని నెఱవేర్చి వచ్చితిఁ గడఁకన్.

౯

జిన్నత్బేగం బఁట యా
కన్నెయభిధ; షానవాబు ఖానునికి స్వా
ర్మి న్నించు కుమారికయఁట ;
యెన్నఁగ నతఁ డేలిక శ్రితబృందము వాఁడే.

౧౦

అని విజ్ఞాపనముంబొనర్ప విని దీర్ఘాలోచనా మగ్నుఁడై
యినచంద్రుం డొకకొంతసే పచట నేత్రేందీవరాల్ గొంచెమే
ని నిమీలింపక, చేయి మీసములపై నిం దీయకే నిల్చి, ది
గ్గన నంతఃపురమేఁగెఁ బోయె భటవర్గంబుల్ పురోగామిగాన్.

౧౧

పతి యనురాగ సంపదయె భవ్యధనమ్మని, నాథుకొల్వె జీ
వితపరమార్థ మౌనని, వివేకమునం జరియించు రాజ్ఞి యా
గతి నిజభర్త చంచలతఁ గాంచుట గాంచినయంత శోకపూ
రితయయి నేత్రపద్మయుగళిన్ జలబిందుసరా ల్వెలార్చుచున్.

౧౨

"మాకులమందు నాపతి ప్రమాదముచేత జనించెనంచు, నే
కైక కళత్రమాత్ర పరితృప్తుఁడు మా మొగలాయిభూమిపా
నీకమునందు నా హృదయనేత యొకండె యటంచు నెంచితిన్;
లోకము పాటివాఁడె మతిలోలత నీతఁడటం చెఱింగితిన్.

౧౩

చలచిత్తుల్ నరపాలు, రందు ముసిలిమ్ క్ష్మాపాలు రగ్రేసరుల్,
జలజాక్షీ నయనోత్పలాసవరసాస్వాదం బపేక్షించు తే
టులనం గీర్తిరమా సమార్జితుల మేటుల్ మా మొగల్ సార్వభౌ
ములు,తద్భూరియశంబునిల్పికొననేమోస్వామికాంక్షించెడున్."

౧౪

ఈ రీతిన్ దలపోయు చేఁగె మొగలాయీ రాజరాజేశు దే
వీరత్నంబు సుతాచతుష్టయముతో వెల్వెల్లనౌ పల్లకీ
లారోహించి సఖీజనం బుభయ పార్శ్వాందోళుల న్వెంటరాన్,
సారాబ్దంబులమాటునం గదలు నక్షత్ర ప్రకాండం బనన్.

౧౫

అంతఃపురమున కేఁగి ని
తాంతాలోచన పరయయి యధిపుఁడా యా వృ
త్తాంతంబు వినుచు ననుచున్
స్వాంతమునం దించుక యుపశమనముఁ బొందెన్.

౧౬

ప్రతి సంవత్సర మాదియామినిని నారంభించి పందొమ్మి దం
చితరాత్రుల్ 'నవరోజు' నాఁబరఁగు ప్రాచీనోత్స వోత్కృష్టముల్;
స్తుతియింపం దగునందుఁ దొమ్మిదవరో జ్కుప్రోజునాఁ బేర; నాఁ
డతిచిత్రంబగు వస్తుజాలములు దేశాత్యంత విఖ్యాతముల్
కుతుకంబొప్పఁగ విక్రయింతురు వణిగ్భూపాల సంఘాంగనల్.

౧౭

ప్రతియామంబున కొక్కసారిగ నగారా మ్రోఁత లుత్సాహపూ
రిత చేతస్కులు పాదుషాపరిజనుల్ విన్పింతు; రానంద సం
గతి నృత్యంబులు గానముల్ సలిపి రొక్కారొక్కము ల్వేడుకల్
సతతం బాతిరునాళ్ల సల్పుదురు సంస్థానేద్ధ విద్యావతుల్.

౧౮

ఆపందొమ్మిది నాఁడులం దొకదినం బబ్జాక్షి సంఘాల కే
తెన్నోపాలుండు ప్రవేశ మేరుపఱచెన్; సద్వస్తుజాలంబులన్
వ్యాపారంబులు సల్పువార లబలావర్గంబులే; మధ్యమం
దాపాద్షా యొకఁడే ప్రియాంగనలతో నాసీనుఁడై యుండెడున్.

౧౯

కొనుఁగోలమ్మకము ల్పొనర్చెడు మెఱుంగుంబోఁడులున్, నిత్యనూ
తనశృంగార విలాస సంపదలఁ బంతాలాడు నంతఃపురాం

గనలున్ మోదముఁ గూర్చుచుందురు మొగల్ త్సామ్రాట్ నేతకుం దత్సతీ
తనయాది ప్రమదా జనంబులకు నేత్రప్రీతి సంధిల్లఁగన్.

౨౦

పటకుటీ రాంతరాసీన పార్థివునకు
బాహ్యవీధీగ తాఖిలభామినులును
గానుపింతురు; కాని తత్కామినులకు
త్సామ్రవిభుఁడు గోచరింపఁ డేమాత్రమేని.

౨౧

నానా దేశ సమాగ తాఖిల ధరానాథాంగనా రత్నముల్
సూనాస్త్ర ప్రదర ప్రకాండములనం జోద్యంబుగా నుత్సవ
స్థానంబందలి పణ్యవీథుల విలాసం బొప్పఁగాఁ బోవుచో
నానందాబ్ధిని నోలలార్తురు దిదృక్షాయత్తలా కాంతలన్.

౨౨

పున్నమనాఁటి వెన్నెలను బోలిన కాంతుల నీను దివ్వె లె
న్నెన్నియొ తోరణాలుగ రచింతురు రాతురులన్మహోత్సవా
లున్న దినాలలోఁ; దదమలోత్తమ కాంతిని గాంచి భ్రాంతిమై
వెన్నెల పుల్గుఁబిండు తమవిందని కూడెదు నాహరింపఁగన్.

౨౩

కనుఁగవ మిఱుమిట్లు గనఁజేయు వన్నెవ
న్నెల మేలిముసుఁగుల తళుకు లోలయ,
వెలలేని నగలమ్రోఁతలతోఁ జెలిమిసేయు
చెలుల మెలుఁగుసవ్వడులు చెలంగ,
కులుకునడ లనేఁగు తళుకుఁబోఁడుల మేని
యత్తరు గంధంబు లలమి కొనఁగ,

చెట్టులుపట్టుక జట్టులుగాఁ బోవు
తమిగంట్ల కనుఁదమ్మిదండ లెసఁగ,
ఆ యుగాది పండుగునాఁడు లావితానఁ
బలురకాల వేడ్కల కునిక్కపట్టు లగుచు
నెట్టి యెడఁదతామర మొగ్గనేని విచ్చి
క్రొత్తచెల్వాల నిగ్గుల గొనబుఁ గూర్చు.

## ౨

౧

కానక కన్నబిడ్డ యవుఁగాపున జిన్నతుకన్నె నెంతయే
సూనికతోడి గారవపుటొద్దికఁ దల్లియుఁ దండ్రియున్ సదా
ప్రాణముతో సమానముగ నాదరముం బొనరింతు, రాసరో
జాననయున్ సమస్తమున తాతలిదండ్రుల నమ్మియుండెడున్.

౨

బాల్యంబాది పితృవ్యపుత్త్రుఁడు, రతీభర్తృ ప్రతీకాశుఁడున్,
దుల్య ప్రాయగుణాంచితుండు, సుకళాధుర్యుండు, గుజ్జారు త
త్కల్యామ్నాయ సమార్జనంబు సలుపన్ దోతెంచి వర్ధిల్లు నా
కల్యాణిం దన ప్రేమలక్ష్యముగ సంకల్పించు చెల్లప్పడున్.

3

పసిమిమై మేలిమిబంగరు మిసిమిమైఁ
దనరు నెమ్మోయి చక్కఁదనమువాఁడు,
సోగలై వలపులవాఁగులై యొప్పెడు
వెడఁదవాల్గన్నుల బెడఁగువాఁడు,
కారులై తేటులబారులో యనఁదగ్గ
సొచ్చెంపు మీసాల సొబఁగువాఁడు,

పరుసమై చూపఱ కరుసమై యెసఁగు నుం
    గరములుగట్టు ముంగురులవాఁడు,
గిల్లుచోఁ బాలుగాఱునాఁ జెల్లునట్టి
నవకముగలాఁడు, తంబురానాదు వోలి
యింపుగానుండు సన్నని యెలుఁగువాఁడు,
జిన్నతు సకుండు, గుల్జారువన్నెకాఁడు.

౮

ఆ యువతీమతల్లియుఁ దదగ్రజుఁ డాటలఁబాటలన్ స్వకీ
యాయతనంబున న్మెలఁగు చారటమెట్టిదొ నేరకుండ మో
దాయతి నుండు; రెల్లెడల నా తరుణీమణియే యొకింతపై
చేయిగనుండి హేళనము చేయుచునుండు వినోదలీలలన్.

౯

చదరంగ మాడుచోఁ జానయే తఱుచుగా
    యువకునాటనుగట్టి యోడఁజేయు,
కట్టుపద్యాలలోఁ గలికియే క్లిష్టస
    మస్యలిచ్చి పురుషు మ్రానుపఱచు,
గానకళాది ప్రకటన మందతివయే
    మగవాని నిపుణత్వ మగడువఱచు,
చతురభాషణమందు సర్వదా కాంతయే
    యతనిఁ 'జిత్తే'నిపించి యతిశయించు,

ఇట్లు తానోడుచుండియు నేవపడక
యాత్మహితురాలు తనకిచ్చు నపజయంబె
జీవితార్థ విజయమంచుఁ జెలఁగినమ్మి
కడపు దిన మొక్కఁగడెగ నాపడుచువాఁడు.

౬

ఒకనాఁ డాయువతీవతంసము వినోదోర్మిన్ హితున్మించి వే
డుకతో నెప్పటియట్టులుండ, "నెపుడో టుంజెందుటేగాని ని
న్నిఁక నిర్జించెడు భాగ్యమీయపుగదా యేనాఁడునా" కంచుఁబొం
దిక గుల్జారన మందహాస మెడయన్ జిన్నత్తనెన్ వానితో.

౭

"అన్నా! నీకిఁక నాదు పీడనము లే దావంతయున్; పాదుషా
నన్నుం బెండిలియాడఁ గోరి జనకున్ రావించి సూచింప, నా
కన్నయ్య త్తఱిఁ బాలువోవక, "ప్రభూ! షాభర్తకున్ దాసుఁడన్,
మన్నాథాజ్ఞ శిరానఁదాల్తు"ననియెన్ మారాడఁగా నేరమిన్.

౮

నను గొంపోవఁగ రాణివాసమునకున్ రారాజు భృత్యాళి యీ
దినమో, రేపొ, మఱెప్పుడో యిచటికే తేరన్ సమస్తాప్తకో
టిని నేవీడక తప్పదన్న! పరిపాటిం గన్నవారల్, సఖుల్
గన దవ్వాదురు; సోదరా! యిఁక నినుంగారింప సయ్యాటలన్.

౯

కడపితి మిన్నినాళ్ళు లోకగర్భమునం జనియించినట్టు, లి
ప్పుడు పరమేశు నాజ్ఞ విడిపోవుచు నుంటిమి, భావికాలమే
వడువున నుండునో? యలరుఁబానుపో, కంటకశయ్యయో? విధా
తృఁ డెదివిధించెనో? నరపతిం గయిఁబట్టఁగ నానతిచ్చెడున్."

౧౦

సుందరి వచనము లంతం
బొందఁగవిని మ్రానుపడినయోజ నిలిచి యా
సుందరుఁడు హృదయమునఁ దన
సందియమును బాపికొనఁ బ్రసంగించె నిటుల్.

౧౧

"పిల్లా! నీవను మాటలెల్ల నిజమా? పెన్గల్వన ల్గావుగా?
జల్లింపం దలపూని యీ కథను బ్రస్తావించినా వేమొ? కా
కల్లా కన్నులు కుట్టె నో క్కొ మన యీయానంద డోలాగతుల్?
చెల్లంబో! ప్రణయాబ్ధి కడ్డుదరు లేలీలన్ సహింపంగనౌ?"

౧౨

అని గుజ్జారనుచుండ నాత్మసుత నాహారార్థముం బిల్వఁ ద
జ్జనసీరత్నము వచ్చె; భాషణములం జాలించి వారేఁగి; రం
త నితాంతాధి నిపీడితుండగుచు నాతం డుండి జాబొండు లే
ఖనమున్ జల్పి పితృవ్య శీర్షకమునం గ్రావించి యెందో చనెన్.

౧౩

"జనకా! నేనిఁక స్వేచ్ఛమై బ్రతుకు కాంక్షన్ బోవుచున్నాను; నా
యునికిం గూరిచి చింత నొందక విశాలోర్విం బ్రవర్తిల్ల నే
ర్తు నటం చెంచి గవేషణమ్ము సలుప న్దోడ్తేర కెవ్వాని ను
న్నన సేయంగల వంచు నమ్మెద" ననన్ వక్కాణ మందుం డిడెన్.

౧౪

గృహమం దెప్పుడు వేడ్కమైఁ దిరుగుటల్, క్రీడావినోదాలలో
బహుళప్రక్రియ మున్గి తేలుటలు, కావ్యగ్రంథ పాఠంబు లా
త్మహితుం గూడి పఠించుటల్, తనదుమాత న్దన్పు కృత్యంబులన్
రహి గావించుటలుం బ్రధానకృతు లానారీ వతంసానకున్.

౧౫

సతమానందముతోడ గంతు లిడుచున్, సంగీతముం బాడుచున్,
అతి చిత్రంబగు చేష్టల న్సలుపుచున్, హాస్య ప్రసంగాలచే
మతులన్ రంజిలఁ జేయుచున్, మెలఁగుటల్మాత్రంబె గావించు జి
న్నెతు సమ్రాట్టుల రాణివాసముల సంధిల్లంగ నెట్లోపునో?

౧౬

జనకుని బాహుశాఖపయిఁ జక్కఁగ వాలి, మనోజ్ఞ గీతికా
ధ్వనులను శ్రోత్రపర్వముగఁ బల్కుచు, శృంఖల మెట్టిదో యెఱుం
గనిగతి సంచరించు చిలుకన్ మణిపంజరమందుఁ బెట్టి స్వ
ర్ణనిగళముల్ తగిల్చి నరనాథున కిచ్చెదునట్టు లయ్యెఁగా?

౧౭

అని తలపోయుచు జననీ
జనకులు జిన్నద్రమణి ప్రశస్తగుణంబుల్
మనమున నెంచుచు, విడు లె
ట్లని విలపించుచుఁ జలహృదయంబుల నుండన్.

౧౮

పాయని చిత్తసంజ్వరపు బాధకుఁ దోడుగ నన్నపుత్రకుం
డేయెడకో చనంగ మది కింతనరాని విషాద మీయఁగా
రోయఁగ గోరుచుట్టుపయి రోఁకటిపో టనుభంగినుండె, పా
సాయిబు మానసంబునకు, సంతత సత్త్వగుణ ప్రపూతకున్.

౧౯

తలిదండ్రుల్ తనుఁగూర్చి ఖేదపడు టాత్మంగాంచి, "నాకోసమెం
దుల కేడ్వన్? బరమేశ్వరుండు మనకెందు న్మేలెచేకూర్చు; నా
కిల రాజ్ఞీపద మేర్పఱింప నెటు లీయింట న్నివాసంబగున్?
తలపోఁతల్విడనాడి మోదమున న న్బంపుం"డనెన్ ధీరతన్.

౨౦

తగిన వయస్సు, దాని కుచితంబగు విద్య, సురూపభాగ్యమున్,
మిగులఁగఁగాంచు కన్నియలమిన్నగ జిన్నెతుక న్నెయుండియున్
మొగలువిభుండు ప్రాయమును బుచ్చినవాఁడని తా నెఱింగియున్
దగఁడని వాదు సేయకయ తండ్రిహితంబునుగోరి యొప్పెడిన్.

కన్నెగా నుండు కాలానఁ గన్నతండ్రి,
పెండ్లియైన పిమ్మటఁ దన ప్రియవిభుండు,
చరమ సమయానఁ బుత్త్రులున్ శాసకులని
నమ్మియుంట జనకుమాట సమ్మతించె.

౨౨

ఉత్తర వయస్సు వాఁడైన నుత్తమగుణుఁ
డున్నత కళాభిమాని సమార్జితుండు
షాజహాన్ చక్రవర్తి యన్ సత్య మెఱిఁగి
కూడఁ దత్కళావతి పెండ్లియాడ నొప్పె.

౨౩

పురుషున కొక్క ర్త పొలఁతి, స్త్రీ కొక్కఁడే
ధవుఁడంట యుత్కృష్ట ధర్మమంచు,
బహుసతీవల్లభత్వము తమలో మాన్పఁ
దగిన దురాచార మగు నటంచు,
వసుధేశులకు నేకపత్నీ వ్రతనియమ
మత్యంతకర్తవ్య మౌ నటంచు,
భావికాలపు మొగల్ భర్తల కిప్పట్ల
మాదిరిగాఁ దా నమరుదునంచు,
ఉత్తమాశయోపేతుఁడై యుండు సార్వ
భౌముఁ డామహాలావణ్యవతిని గాంచి
నంత స్ఖలిత చిత్త స్థైర్యుఁడై చరించె;
కాంత యనుపమదికి నయస్కాంతమొగద!

౨౪

పలువురు బిడ్డలుండినను, భార్య సముద్రసుతా సమానయై
కలకలలాడుచుండినను, గన్నడ సేసెడు వార లెవ్వరున్

గలుగక యుండినన్, దన సుఖంబున కాఁక యెఱుంగకుండినన్,
జలిత మనస్కుఁడయ్యె నరనాథుఁడు కేవల రూపలోలుఁడై.

౨౫

తన యర్ధాంగి మనస్సెటు ల్కలఁగునో, ధర్మజ్ఞులౌ పుత్త్రు లే
మని నిందింతురొ, భావికాలమున నీయధ్యాత్మ జిన్నత్సతీ
మణి నేసిల్గుల పాలుసేయునొ, సుతల్మాత్సర్యముం గాంచి యే
పనికిం బూనుదురో యనం దలఁపులే పాడ్గాకు లేకుండెఁగా!

౨౬

మర్త్యలోకాప్సరఃకాంత, మంగళాంగి,
ఒక యపూర్వలావణ్యమయి, కలకంఠి,
తనకు వశమై యమరలోక ఘన సుఖంబు
నిచ్చునని మాత్ర మూహించె నృపవరుండు.

౩

౧

అరుణోదయంబున కాఱుగడెలమున్నె
వడిఁ గాల్యములఁ దీర్చి గుడికిఁ బోవు,
తెల్లవాఱినయంత నెల్లవారికి "జరో
కా" దర్శనం బిచ్చి యాదరించు,
గజకలహంబు వ్యాఘ్రముల పోరాటంబు
లాది వినోదాల నచటఁ జూచు,
అవలఁ 'దివానియా' మనుసభ కేఁగి యం
త 'దివానిఖాసు' మంతనము సల్పు.
అవులఁ బట్టమహిషిఁగూడి యంతిపురిని
వేడుకనుడు లాడుకొనుచు విందుఁగుడుచుఁ,

బత్ని బోధింప వితరణపటిమఁ జూపు,
పాదుషా దినచర్య యీపగిది వెలయు.

౨

అపుడే భార్యయుఁగూఁతులుం గలసియాహ్వాయంబుగాఁబల్కుచున్
నృపు సంతోషముఁబెట్టఁ జూతురు; ధరానేత్రుండుఁ బ్రీతి న్గటుం
బపు సౌఖ్యాతిశయానుభూతి నపు డేపారం బ్రమోదించెడున్;
అపుడే యొండొరు లంతరంగపుఁ దెరల్ యత్నింతు రొత్తింపఁగన్

3

ఒకనాఁ డట్టిముహూర్తమందె ప్రభువర్యుం డాత్మజాతాళిలోఁ
బ్రకటప్రజ్ఞ నెసంగియుండు రమణీరత్నంబు, రోష్నారఁ బి
ల్చి, "కుమారీ! యల షానవాబుతనయన్ జిన్నత్తునా సుందరిన్
బికవాణిం గయిఁ బట్ట నెంచితిని; రావింపంగ దే వేగమే.

౪

మన దైవజ్ఞులు నిర్ణయించు తఱి సంభావించి తోడ్తేరఁగా,
మణిమాల్యాంబర వాహనాదులిడి మామర్యాదలం జల్పఁగా,
మనదాసీజనము న్నియుక్తముగఁ బంపన్, సద్గృహశ్రేణిలో
ననుకూలంబగు రంగ్మహాల్ విడిదెనీయన్, నీవెయత్నింపుమా!

౫

నావలచుకాంత నీకుఁ జిన్నమ్మగాన
సర్వవిధ గౌరవంబులున్ సలుపఁదగును;
రంగ్మహాలునం దామెకర్హ మగు స్వాగ
తం బొసంగు భారము నీవెతాల్పవలయు."

౬

అని రారాజిడు శాసనంబు విని కొయ్యంబారె మమ్తాజి, యే
మనలే కూరక యూఁగలోయనఁగ మాటాడంగ లేకుండి రా

తనయల్లుళ్ల్వురు, రోషనార 'సరియే, తండ్రీ!' యనంజాలెఁ, ద
క్కిన దాసీతతి దవ్వులంజనియె నేకీడ్పాటు రాకుండఁగన్.

౭

కనుఁదమ్ముల్ కడుఁజెమ్మగిల్ల మహిషీకాంతా ప్రకాండంబు మో
మున బంగారు జరీముసుంగు పొలయన్, ముత్యాలదండల్వలెన్
నునుఁజెక్కుంగవ బాష్పబిందువుల శ్రేణుల్ రాల, నాత్మేశుఁజూ
డను మారాడను నేర కొత్తగిలియుండ న్బాసె జేఁ డచ్చోటునన్.

౮

"ఊరడిలు మమ్మ! మేము నీకుండ లోప
మేమికలుగఁ గలదు? నిన్ను నెల్లవేళఁ
గంటికిని ఱెప్పవోలెనే కాతు మమ్మ!
ఒకతెగాదు, వేలు సపత్ను లుండనిమ్ము."

౯

అనుచు రోషనారపలికి యాత్మచేటి,
మాయల మరాటి, మోసపుంబనులమేటి,
మందులకుఁ బేటి, యాం ఫతీమానిశాటిఁ
బిల్చి మంతనం బాడఁగా వెడలిచనియె.

౧౦

మహతా బ్జరీచీరమడత లుంచిన పైఁడి
పళ్లెరాల వహించు పడఁతులగమి,
మణిమాలికలు హేమమయ కంకణాదులుం
గల పాత్రల ధరించు నెలఁతలగమి,
అమల సుగంధ తైలములున్న పసిఁడి య
త్తరుదానులం దాల్చు తరుణులగమి,

ద్రాక్షాఫలాలు, బాదముపండ్లు, శర్కర
ఖండములుంబూను గరితలగమి,
మదనసాయకపంక్తినాఁ బొదలి చనిరి
షానవాబు ఖానుని భవనాన కెలమి;
కాన్కలన్నియు నర్పించి కన్యకఁ గయి
సేయఁ బ్రభునాజ్ఞ నీరీతిఁ జెప్పిరపుడు.

౧౧

"అమ్మా! జిన్నతు కన్య! నీవధిక పుణ్యశ్రీల నార్జించుటన్
సమ్మానంబున షాజహా న్నృపతిచింతారత్నమే నీకు వ
శ్యమ్మై కాంక్షిత సర్వవస్తుసముదాయం బీ న్గటాక్షించె; నీ
వమ్మా నాథుకరంబుఁ బట్ట నరుదెమ్మా, స్వర్ణ పల్యంకికన్!

౧౨

కన్యాదాతలు! పూర్వపుణ్యగరిమన్ క్ష్మాపాలుఁ డల్లుండు, మీ
కన్యం జేయది కావలెన్? దనయకిం గాశీస్సు లందీయుఁడీ!
ధన్యుల్గా న్మొగలాయి రాజవరు హస్తాల న్సమర్పింపుఁడీ
కన్యారత్నము! సార్వభౌముఁడిడు కాన్కల్గొంచు మన్నింపుఁడీ!"

౧౩

అనుమాట ల్విని దంపతు ల్మిగులఖేదామోద సమ్మిశ్రభా
వనులై యుండియు జేనియానతి తరింపన్ రానిదై యుంట నె
మ్మనమం దూరటఁగాంచి యాత్మసుతనంపన్ సర్వసన్నాహము
ల్పొనరింపం గమకించి రెల్లవగపుల్ లోలోననే మ్రింగుచున్.

౧౪

జలకములార్చి, వేనలి దశాంగపు ధూపమువైచి, రాచదు
వ్వలువలు గట్టఁ బెట్టి, నరపాలుఁడు పంపిన రత్నభూషణం

బులు ధరియింపఁ జేసి, మెయిఁ బున్గు, జవాజియు, మేలియత్తరుల్
గలపము లెన్ని యోయలఁది, కన్నె నలంకృతఁ జేసి రాదటన్.

౧౫

పసిఁడి మెఱుంగుల న్వెలయు పల్లకిలో నగిషీ జరీలతల్
పొసఁగిన చీనిపట్టుఁబఱపున్, బయిఁ నల్లషు దుప్పటంబు, నిం
పెసఁగ నమర్చి, సెజ్జజిగి కెంతయు నీడగు మేలిదిండులన్
ససిగఁ గుదిర్చి, రాజపరిచారిక లాతనువల్లి రమ్మనన్.

౧౬

తనయను గౌఁగిలించి తలిదండ్రులు బారున నేడ్చి, రావధూ
జనమణియుం బ్రియాప్త సఖసంఘ వియోగభరంబు దుస్సహం
బనుచు, నకారణంబగు తదంచితరాగము విస్మరింప నె
ట్లనుచు, వచించి వావిడిచి హాయని యేడ్చె నెలుంగురాల్పడన్.

౧౭

అల్లుఁడు స్థితిగతులఁ దుల్యుఁడయ్యె నేని
అత్తవారికిఁ జింత యావంత గలుగ;
దసమ సంబంధ బాంధవ్యమైన యపుడె
యొండొరుల్ దూరదూరాలనుంద్రు వగల.

౧౮

"ఆఁడు బిడ్డల నత్తింటి కనుపునపుడు
తల్లిదండ్రుల కుండు చింతావిధంబు
తెలియ దబలలఁ గన్నవారలకె గాని;
ప్రసవవేదన తెలియునే వంధ్య కవని?"

౧౯

అని కవితల్లజుం డొకరుఁ డాడిన మాటలు పూర్ణ సత్యముల్;
ఘనుఁడగు పానవాబుఁ బ్రియకాంతయుఁ గూరిమికూఁతుఁబంపుచో

నెనసిన దుఃఖ మిట్టిదని యేర్పడ వర్ణన సేయుకంటె నె
మ్మనముల నూహసేయుఁడని మాప్రియ పాఠకకోటిఁ గోరెదన్.

౨౦

తల్లియుఁ దండ్రియున్ సుతయుఁ దత్సమయంబునఁ జేయుచేష్టలన్
దల్లడపాటుచే నెనయు తాపవిశేషము, రోదనాదికం
బెల్ల రచింప శక్యమగునే? మతిమంతులు! పాఠకోత్తముల్!
ఉల్లములందు భావనమె యుక్తము; దృశ్యము గోచరంబగున్.

౨౧

"ఒక సామాన్య కుటుంబమందు సుత నే ముద్వాహమందీయఁ ద
ప్పక యన్యోన్యము రాకపోకలను సల్పన్ వీలుచేకూఱు; ని
ష్ఠాక యంతఃపుర దేవిగా ననుప నేయోజన్ సమీపంపనా?
మొకమేఁ జూడని దుస్థితుల్ప్రాపసఁగునేమో" యంచు వారేడ్చుచున్

౨౨

తమకుఁ గలిగినంత తగవు తనయకిచ్చి,
దీర్ఘమాంగల్య సిద్ధిగా దీవన లిడి,
కన్నులను నీరు మున్నీరుగా స్రవింప
జన్నతుసతి నంపకమును జేసి రపుడు.

౨౩

పైకెగిరిచన్న రాచిల్క పంజరమన,
దీపమాఱిన దేవమందిర మనంగ,
మబ్బులలమ మాట్పడు చంద్రమండలమన,
జన్నతుచన ఖాను గృహము చిన్నవోయె.

౪

౧

కణనేమూల చరించినన్ జనము లాగ్రాయంచు ఢిల్లీశునూ
తనవైవాహిక సంప్రయోగ పరివాదంబుల్ ప్రలాపించుచే
వినవయ్యెన్; ''బహుసంతతిం బడసి పృథ్వీశుండు వేరొండుక
న్య నపేక్షించుట యామెకుందనకుఁ జేటా'' నన్న వాక్యాళితో.

౨

పురమెల్లంగయిసేసినారు; కుసుమంపుందోరణా ల్కట్టినా
రరఁటుల్ పోఁకలు కంబముల్నిలిపి; దుర్గాంతర్గత స్థానులన్
బరపా పందిరులన్ మనోహరలతాభాండ ప్రసారంబుతోఁ
గరమర్థిన్విరచించి యుంచిరి; మొగల్ క్ష్మాపాల కాజ్ఞప్తులై.

౩

ధవళవర్ణ ప్రియుఁడుగాన ధరణిధవుఁడు
రంగ్మహలునం దచ్చంపురంగుఁ బూఁత,
లచ్చపుం బూలతోరణా, లమరఁజేసి
రజత కాచపాత్రల దీపరాజి వెలచె.

౪

అవి ధవళపక్షనిశలు, సుధాకరుండు
వెండివెన్నెల పూఁతలం బృథివికెల్ల
వెల్ల నిడువేళ జిన్నతుపల్లకీ ది
వాణముఁ దరిసె నోంకృతిధ్వను లెసంగ.

౫

ఆశ్వికులైన యహద్దీను లుమ్రాలు
నుండు మొదటిద్వార మొదిఁగి చనిరె;

రసపుత్త్రులౌ ద్వారరక్షకు లొప్ప రెం
డవగుమ్మ మల్లనన్ దాఁటి పోయె;
కొజ్జా లనఁబడు నకుంఠిత వీరాళి
రక్షించు మూఁడవరథ్య మెడసె;
వీరనారీవార మారయు నాల్గవ
వాఁకిలి నవ్వలఁ బాసియేఁగె
ఇట్లు కక్ష్యాంతరంబులనెల్లఁ గడచి
జిన్నతున్న పల్యంకిక చేరె రాణి
వాస; మప్పట్లఁ గై సేయఁబడ్డ రంగ్మ
హాలునఁ బ్రవేశమందె నావాలుఁగంటి.

౬

సితవర్ణాంబరధారిణుల్, సితసుమశ్రేణీ శిరోభూషణల్,
సితమందార ముఖ ప్రసూనసరముల్ చేపట్టి సంగీతసం
గతి నృత్యం బొనరించుచున్ వరవధూ కంఠంబునందుంచి వే
గ తిరోధానముఁ గాంచి రొక్కవరుసన్ గజ్జల్ రవాళింపఁగా.

౭

కాంచనవర్ణ వస్త్రములఁగట్టిన కాంతలు బారుబారు లే
తెంచి సువర్ణ పాత్రికలఁ దెచ్చిన కప్పురపుంగణాల వె
ల్గించి మనోహర ప్రణయగీతికఁ బాడుచు రాముకు న్నివా
ళించి విచిత్ర నృత్యగతిలీల సలాము లొనర్చి యేఁగినన్.

౮

జనకునాజ్ఞఁ బాటించి నూతన వధూవ
తంసమునకు స్వాగత సమాదరము సల్పఁ
జేటికా సహితయగుచుఁ జేరెనచట
రోషనారా నధూటి కాలుష్యపాటి.

౯

బమ్మదేవర పుత్తడి బొమ్మఁ దెచ్చి,
మొదట సర్వాంగ సుందరముగ నొనర్చి,
ప్రాణముల్ దానికిం బోసెనా యనంగఁ
గాంతలావణ్య మమర దిగ్భ్రాంతయగుచు,

౧౦

"సకల భారత ధాత్రికిఁ జక్రవర్తి,
శత్రుకోట్లకు సమవర్తి, షాజహాను
మా ప్రియజనకుఁ డతిలోకమంజులమ్ము,
కొమ్మ! నీ యందమునకు ముగ్ధుండు సుమ్మ!

౧౧

స్వాగతము నీకు మారాణివాసమునకు,
స్వాగతము సార్వభౌము నైశ్వర్యములకు,
స్వాగతము రాజరా ట్పరిణయంపుఖునికి,
స్వాగతము చిన్నదేవీ! శుభాగతంబు!

౧౨

అని పలికి రోషనారాలతాంగి యేఁగె;
జిన్నతు వధూలలామ యేమన్న వింట
మాత్రమేగాని యెరికి న్నారు పల్క
నేరకుండెఁ; గడపె రేయి వారినడుమ.

౧౩

మఱునటినాఁడు రంగ్మహలు మంగళ వాద్యనినాద సంగతిన్
ద్వారగతి సంచరించు సచివ ప్రముఖోన్నతరాజభృత్య బం
ధురపరిఘోషయుక్తిఁ బరితోషముఁ గూర్చెడి సందడిన్, మనో
హరముగఁ గన్పడెన్ బరిణయంపుదినం బది జేని కౌటచే,

౧౪

అధికాడంబరమేమిలేకయ వివాహంబయ్యెఁ; దన్మాఖ్య సం
విధులే చెల్లెనుగాని, బాహ్యవిభవావిష్కార మేమాత్రమున్
విధియింపండు మొగల్విభుండు, ప్రజ వేభిత్తింబ్రకల్పింతురో,
ప్రథనం బెట్టిది రాణులన్ గలిగి క్షోభంగూర్చు నన్భీతిచే.

౧౫

దక్షిణాపథ విజయ సాధనములెల్ల
షానవాజ్ఖాను నిపుణహస్తంగతాల
టన్న మిషపెట్టి యీ యుపయామ మయ్యె;
నిజము జిన్నతు సౌందర్య నిస్తులతయె.

౧౬

గోధుమవర్ణంబు, గుబురైన శ్మశ్రువుల్,
వెడఁదనెన్నుదు, రెత్తఁబడిన బొమలు,
మిలమిలలాడు కన్నులు, నల్లనౌగ్రుడ్లు
తిన్నని ముక్కునం జిన్నకాయ,
చక్కని పల్వరుస, యలుపపు నోరు,
కడు మనోహరమైన కంఠరవము,
దివ్యజాతకుఁడంచుఁ దెల్పెడు తిలకాల
కము లపసవ్యంపుకరము వ్రేళ్ల,
పుష్టికిఁ దగిన పొడవు, సంతుష్టిఁ దెల్పు
సంతత ప్రసన్నవదనాబ్జంబుఁ గల్గి
షాజహాన్ సార్వభౌముండు సకలజన న
యనచకోరక సోముండై యనఁగ నొప్పు.

౧౭

అట్టి దివ్యసుందర విగ్రహంబుఁగాంచి
జివ్నతుసతి ప్రమోద సంపన్నయయ్యెఁ
దద్ధృదయ సుందరత్వమున్ దలఁచిచూచి
విమ్మట నదృష్టముంగూర్చి నమ్మెఁదలఁచె.

౧౮

ఉపయామానంతర మా
యపూర్వ సౌందర్యవతిని ననుచరనారుల్
నృపవరు నాజ్ఞన్ దేవీ
కృపకై తద్దర్శనమొనరింపఁగఁ గొంపోన్.

౧౯

ఫుల్ల సరోజ పుష్పయుగమున్ బురుడించెడు నేత్రయుగ్మ మ
ల్లల్లనవిచ్చి యాసవతి నానఖమస్తక మొక్కసారి యా
పల్లవపాణి చూడఁగ సుపర్వసతీమణి యేమొ యీమె నా
నుల్లము పల్లవింప భ్రమమొందిన దాని తెలంగు రాపడెన్.

౨౦

కొంతవడి యట్టులుండి యా కోమలాంగి
యాత్మనయనపాత్రలనిండి యమున పాఱఁ
బ్రక్కఁగా మోముఁ ద్రిప్పి నీలాలధార
కన్గొలికితూములవెలార్చెఁ గసటువోవ.

౨౧

కూఁతులది యసూయా దుఃఖ జాతమనుచు
విశ్వసించి దాసీసఖీబృంద మరసి
"అందఱముఁగూడి యమ్మ కీకుందుమాన్ప
వైళమ జతనముల్ సల్పవలయుఁ జుండి!"

౨౨

అనుచు గుసగుసలాడుచు నవలఁ జనిరి;
పెండ్లికూఁతురు వంగి దేవికి సలాము
చేయఁ గన్నీటి కాల్వలోఁ జిన్నినవ్వు
వెన్నెల లొలయ నిమిరి దీవించె సవతి.

౨౩

వధువు రంగ్మహాలున కేఁగె; వరుఁడు వేచి
యుండె విందారగింప నా యువతిఁగూడి
నవవధూవరు లాప్యాయనంబు మీఱ
ననుభవించిరి భక్ష్యభోజ్యాన్నభుక్తి.

౨౪

శయ్యాగారమునందు రాజవరుఁ డేచర్య న్వనాయించెనో,
సయ్యోద్దన్ మయికంపుమందు లెవి యాసారించి సాధించెనో,
యె య్యాచార్యక మాచరించి మది నా కృష్టంబు గావించెనో,
యయ్యబ్జానన పాజహాను వశమై యానంద మగ్నాత్మయై,

౨౫

కొలఁది దినాలలోనె తనకుంగడుఁగూర్చెడు తల్లిదండ్రులన్,
గళలను గ్రీడలం జెలిమికాఁడగు సోదరవర్యు గుల్జరున్,
గలకలలాడుచున్ జననికన్నను మిన్నగమోదమిచ్చు పె
ద్దలు గడియించియున్న గృహతల్లజమున్ దలపెట్టకుండెఁగా.

౨౬

సతతారాధ్యుఁడు దైవమే మగఁడు, తత్సంసేవలం జల్పి త
న్మతి రంజిల్లఁగఁ జేయుటే సతికి ధర్మంబంచు విశ్వాస సం
గతిచే జిన్న తనారతంబు పతి సాంగత్యంబుఁ గాంక్షించె; భూ
పతియున్ దద్హృదయాభిలాష నెఱవేర్పంబూనె సంప్రీతిమై.

౨౭

పగటి భోజనంబు బహువిధదానముల్
పెద్దరాణి గృహము నొద్ద జరపు;
రాత్రి కుడువు చిన్నరాణికడ నొనర్చి
పడకకూడ నచో టెనడపు విభుఁడు.

౨౮

తాను జక్రవర్తికిఁ బ్రియదారయైనఁ,
దనకు నడిగట్టులై భృత్యజనములున్న,
గరువమింతైనఁ గనదయ్యె గరితమిన్న
నైజ సద్గుణశీల లీయోజగాదె?

౨౯

దినములు లిప్తలట్టులు గతించెను వేడుక వెల్లియందు వా
రనయము మున్గియుంట; సతమా నవదంపతు లీధరాతలం
బున నె నిలింపలోకసుఖము న్గనుచుంద్రు రతీమనోజులో
యనఁజరియించుచున్ ఋతువులన్ని వసంతములంచు నెంచుచున్.

౩౦

తా బేదారుఁడె కాక ఖాను దుహిత న్దానంబుగావించి పా
ద్షాబంధుత్వముఁ బొందుటన్ బురిఁబ్రతిష్ఠం గాంచె; నుద్యోగమం
ధా బాధ ల్పడకుండ వృద్ధిగనె నిత్యం బేదొజాగీరు గా
రాబంబొప్ప నృపాలుఁడీయ ధనసంప్రాప్తుం డతండయ్యెడిన్.



౨౫

౧

హిందూముసల్మాను బృందమ్ము సౌభ్రాత్ర
మొప్ప వర్తించు నభ్యుదయ యుగము,
ధనలక్ష్మి ఘల్లుఘల్లన రాచనగరిలోఁ
దాండవమ్మాడు సాధనయుగమ్ము,
మొగలుసభానభమ్మునఁ గవి గాయక
పండితభాస్కరుల్ ప్రబలుయుగము,
హైందవ పారసీకాయత శిల్పక
ళా సమన్వయము చెలంగుయుగము.

సకలవస్తుసమృద్ధియు, సర్వభాగ్య
సౌఖ్య సంసిద్ధియు, సమస్తశాస్త్ర సంచ
యాభివృద్ధియుం గల్గి యత్యంత వైభ
వాన వెలయు యుగము మొగల్ స్వర్ణయుగము.

౨

చింతామణియును శమంతక రత్నమున్
నేత్రద్వయంబుగా నెగడియుండ,
సామంతరాజు లొసఁగు నింద్రనీలాల
పింఛ సౌభాగ్య మావిష్కరింప,
వెలలేని నవరత్న బృందముల్ శారీర
సౌందర్యసంపద సంతరింప,
శుద్ధ హేమమయాలు సురుచిర స్తంభమ్ము
లవలంబ దండమ్ము లగుచు నొప్ప,

విలువ నవకోటి రూప్యము ల్గలదటంచు
నాఁడె నిర్ణయమైన యనర్ఘ పీఠి
షాజహాన్ సార్వభౌము ప్రశస్తకీర్తి
హాసము వెలార్చు కేకిసింహాసనమ్ము.

3

ఆసింహ పీఠాన ననుపమ విభవాన
శ్రీ సార్వభౌముఁ డాసీనుఁ డగుచుఁ
దన తులాభార రత్నచయంబు యోగ్యాశ్రి
తాళి కొసఁగు వినోదాల నొకటఁ
దనసభాస్థలికి వచ్చిన పరదేశదూ
తలతోఁ బ్రసంగము ల్సలుపుటొకటఁ
దనఖజానాలోని ధన మైదువందల
కోట్లమ్యోనా వింటఁ గొదరు టొకట
సల్పుచు న్నిజామాత్యప్రశస్తనీతి
కుశలు, సాదుల్ల యల్లామిఁగూడి పొలుచు
నల సుధర్మాంతరాన బృహస్పతి సహి
తుండుగాఁ గొలువుండు నింద్రుండునాఁగ.

౪

అమ్మణిమయ మయూర సింహాసనమ్ము
చెంత స్వర్ణపీఠాన నాసీనుఁడగును
రాజరాజు నౌరసకుమారక వరుండు,
న్యాయపరుఁడు, దారాభిధేయ ఘనుఁడు.

౫

'రామాయణమ్ము'ఁ బర్షియాభాషఁ గూర్చిన
"చింతామణి" కవిశచీవిభుండు,

నీతిదాయక "భామినీ విలాస" కృతిక
ఱందు "జగన్నాథ పండిత" కవి,
"యోగవాసిష్ట' కావ్యోత్తమంబు విమర్శఁ
జేసిన "యాచార్యశేఖర" కవి,
ఆస్థాన కవిచంద్రుఁడౌ "నబుల్తాలిబ్ క
లీ" మను కవిపుండరీక గజము,

"చంద్రభాన్" ముఖ భావకవీంద్రతతియు,
షాజహాన్ఫాదుషా సభాస్థానమందు
ననుపమాన తేజోమూర్తు లగుచు నపుడు
వెలయుచుండిరి దివ్యతారల విధాన.

౬

విశ్రుత విద్వత్క-విశ్రేష్ఠ హీరహా
రతరళ మనుకీర్తి రమనుగాంచి
సంగీతసాహిత్య చక్రవర్తి యను య
శఃకాంతి నాంధ్రదేశాన వెలిఁగి
అతిలోకసౌందర్యవతియౌ లవంగికు
రంగేక్షణకుఁ బ్రియప్రథితిఁ జెంది
దారాఖ్యయువరాజ తల్లజు నాస్థాన
కవిమిత్రుఁడనెడు విఖ్యాతిఁ బడసి

కొమ్ములు తిరిగిన కవిగజమ్ములేని
చొరనశక్యమౌ మొగలాయివరు సభాప్ర
వేశమంది, తనకు నాంధ్రదేశమునకుఁ
బ్రతిభఁ గూర్చిన పండితరాయ లుండె.

౭

తాన్సేను మనుమఁడై తనరు "గుణ సముద్రుఁ"
డాదియౌ గానవిద్యాధిపతులు,
మిగులఁ బేరొందిన "మీర్హాసీమ్" మున్నగాఁ
గల చిత్రకార కాగ్రసర బుధులు,
లలితయశులగు "ముల్లాఫరీద్మునజిమ్" మొ
దలగు ఖగోళశాస్త్రజ్ఞ గురులు,
కీర్తికాయులగు "హకీ మవిముద్దీన్ వ
జీర్ష" ప్రముఖులౌ ప్రసిద్ధ వైద్యు,
లా మహాసార్వభౌము సభాంతరమునఁ
గోటిసూర్య ప్రకాశులై కొమరుమిగిలి
నిరుపమాన సమర్థతా గరిమఁ గల్గి
యర్హా గౌరవాతిశయము లందు చంద్రు.

౮

అల 'రుబా' బనెడు వాద్యముఁబూని మ్రోయించి
"సుక్సేను" సభ్యులఁ జొక్కఁబఱచు,
కిన్నరామృత వీణల న్నిపుణుఁ డగు "సూ
ర్సేన్" గానసుధల నొల్కించుచుండు,
స్వరమండలియను ప్రశస్త వాద్యానఁ "దా
న్సేను మన్మఁడు" రక్తిఁ జిందఁజేయు,
కంఠమాధుర్య మఖండమై యొప్ప "జ
గన్నాథభట్టు" శ్లోకాలు చదువు,

తాను ప్రేమించు "దుప'దాఖ్య గానరసము
శ్రుతిపుటమ్ములు హాయిగా జుట్టి జుట్టి
యవల షాజహాను స్వయముగా నమృతగాన
లహరి వెలిచి శ్రోతలను గజాంగఁ జేయు.

౯

దివ్య వైభవోపేతమై తేజరిల్లు
నమ్మహాసభ కొక్కనాఁ డరుగుదెంచె
నహ్మదునగ రాస్థాన సమాశ్రితద్వ
యంబు, ఫత్తాను దూతల్ రహస్యమాడ.

౧౦

ముఖ్యసచివుని యనుమతిఁ బొంది వారు
నీలకంఠ సింహాసన నిష్ఠఁ బొలుచు
షాజహాన్ సార్వభౌముని సన్నిధాన
మందు వంగి 'చార్తస్లీము' లాచరించి.

౧౧

"ఓమహాప్రభూ! మావిభుం డొక్కమనవి
నేలికల కొనర్పఁగ నానతిచ్చి పంపె;
అది యుభయతారక మగుట నాలకింపఁ
బ్రీతిఁబాలింప వినతిఁ బ్రార్థింతు మిపుడు."

౧౨

అనుడుఁ జక్రవర్తి తనపార్శ్వభృత్యాళి
దప్పువచన, నమాత్య తనయవరులె
యచట నిలిచియుండ నాజ్ఞయిచ్చి, దరికి
రా ననుమతి దూతలకు నొసంగె.

౧౩

"మానగుణోన్నతుండగు సమాత్యవరుం డొడయందు మాకు, ఫ
క్షానుఁ ; స్వకీయ బాంధవ నికాయముఁగూడి విరోధమూను సు
ల్తాను నిజాంసహాపయిని, దక్షిణరాజ్యరమన్ మొగల్మహా
మానవనాథు భూరిభుజమండలి నిల్ప వినిశ్చితాత్ముఁడై.

౧౪

వీరచమూ సమూహ పరివేష్టితులై ప్రభువర్యులిత్తఱిన్
ఘోరరణం బొనర్ప నొడఁగూడిన, సాయము తానుగూడ నిం
డారఁగఁజేయఁ బూనుదు నటం, చవలీలఁగ దక్షిణాపథ
ద్వారకవాటము న్దెఱచి వశ్యమొనర్తు నటంచుఁ బల్కెడిన్."

౧౫

"రాయబారులార! ప్రణయ ప్రపూర్ణుఁడై
మిత్రుఁ డంపు నీ పవిత్రవార్త
మా కవగతమయ్యె; మరలుండు, హితుకోర్కెఁ
దీర్చువార మంచుఁ దెల్పుఁ డయ్య!"

౧౬

అనుచు నుచిత బహూకృతు లందఁజేసి
వారిననిపి, సైన్యమహాధికారిఁ బిలిచి,
సర్వసన్నాహము ల్సల్పఁ జక్రవర్తి
యాజ్ఞ నొసఁగ, సేనాని యిట్లనియెనపుడు.

౧౭

"స్వామీ! దక్షిణ దండయాత్ర నెఱవేర్పంజాలు శక్తుండ నే
నేమాత్రంబునుగాను, వైరిజన కుంభీంద్రంబుల న్మొంపఁగా
సామర్థ్యంబునుగాంచు నంకుశములౌ క్ష్మాపాలురే మాపురో
గాముల్గావలె, సర్వసైన్యములకు న్నాయకులై మించుచున్."

౧౮

"ప్రభువ! మహబత్ వచించెడు వాక్కు నిజము,
సర్వ సేనాధిపత్యంబు నిర్వహింప
దక్షిణాశా విజయయాత్ర తలకొనంగ
నొక్క దేవర యే యర్హు; లోరులుగారు."

౧౯

అనుచు నమాత్యుఁడుంబలుక నాయకిమిఁ డెదిసేయఁ దోఁప కొ క్కనిముస మూరకుండెఁ బ్రియకాంతను, జిన్నతు వీడిపోవు టె ట్లని, ప్రతిరాత్రి పూర్ణిమగ నందమృతంబు మెసంగు పుల్గుజం టనఁ దమరొప్పు, దాని విడనాడుట యెట్లని, చింతసేయుచున్.

౨౦

రాజధర్మాతిశయ మొక్క ప్రక్క లాఁగ,
రాజసాతిభూమి మఱొక్క ప్రక్క లాఁగు.
మానస తులయం దుభయ ధర్మంబులుంచి
తూఁప మొదటిదాని వలనె తోఁచె ముల్లు.

౨౧

కృత నిశ్చయుఁడయ్యె మొగల్
క్షితిపతి రణరంగయాత్ర సేయన్, సేనా
పతిగాఁ దానే యమరన్;
గుతుకంబొప్పు రణభేరిఁ గొట్టఁగఁ బనిచెన్.

౨౨

అభేరీనినదంబు కర్ణకుహ రాయాతంబుగాన్ జిన్న తెం తో భీతింగని ప్రాణనాథుకొఱ కత్యుగ్రాఢ సంవేగమున్ ఆభీలాధియు నొందఁజొచ్చె, నెడఁబాయన్వచ్చుఁ దన్నంచు, నె ట్లాభారంబు సహింపనౌననుచు ఖేదాయత్త చిత్తాబ్జయై.

౨౩

రేయి బోనమ్ము వేళకు నృపుడువచ్చి
విన్నఁబోయిన మొగమొందు జిన్నతుఁగని
"దక్షిణాపథ సమరయాత్రను గురించి
వినుటనా, ప్రియా, నీకిట్టి విన్నఁదనము?

౨౪

రాజధర్మాచరణము కర్తవ్య మగుటఁ
బ్రాణకాంత! నిన్వీడుట తప్పనిదియయ్యె;
ఎల్లి పయనంబు, నెలలోన నేను మరలి
వత్తు, మేలవగపు బేలపగిఁది, బాల?

౨౫

తిండియు నిద్రయున్ మఱపుఁ దెచ్చెడు చిత్రకథా గుళుచ్ఛముల్
మెండుగనున్న వీయెడల; మీసరపుంగత లేరి నేర్వమా!
నిండునినాదము ల్గలవి, నీకయి తెచ్చిన వాద్యరాశి, స్వ
ర్మండలి ముఖ్యముల్ గలవు; మానిని! వానిని వాఁడుకోఁగదే!

౨౬

ద్రాక్షరసము గానరసమును దుల్యముల్
మధురభావమందు మత్తునందు;
గానరసము నాన మే నెఱుఁగమి గాక
యిట్టి దనఁగరాని యెలమి నొప్పు.

౨౭

కానఁ బ్రాణప్రియా! నీవు వానితోడఁ
గాలముం బుచ్చు మేలాగొ జాలిఁబడక;
నెలకువచ్చు వెన్నెలవెల్లి జలకమాడ
మరలివత్తు నీ కడకు, నామాట నమ్ము."

౨౮

అనుచుం బల్కెడు చక్రవర్తినుడు లాయజ్ఞాక్షి యాలించి కొం
గున బాష్పాంబువు లొత్తుకొంచుఁ బలికెన్, "క్షోణీశ! యే ప్రాణితో
ననుబంధం బననేదియో గనక స్వేచ్ఛాకాశ సంచారమున్
గను పక్షిన్నను స్వామి మచ్చికఁ గొనంగా వశ్యురాలైతిఁగా ?

౨౯

అర్థ శరీరనామ మది సార్థకమాట నిజంబు నా యెడన్;
పార్థివచంద్ర! నా సగము నన్విడి మిక్కిలిదూర మేఁగఁగా
వ్యర్థముగాదె తక్కుఁగల యర్థము? మాసము మాత్రమేని దే
హార్థము జీవముల్ పడయనౌనొకో? కూడఁ గొనంగ రాదొకో?

౩౦

అలసి దేవర డేరాకు నరుగుఁ దేర
నలఁత నపనయించెదు సపర్య లొనరింతు ;
ప్రభుల నలరింతు మల్హారురాగ మాల
పించి, కిన్నరవీణ వాయించు చెలిమి."

౩౧

"అక్కటా! యమాయకురాల వౌదు, కాంత!
యుద్ధరంగ మెంత భయదమో యెఱుఁగవు ;
కుడువఁగూడు, నిలువనీడఁగూడ దొరక,
వొక్కతఱిఁ బడరాని పాట్లొందవలయు.

౩౨

కరిఘీంకార నినాదముల్, తురగ సంఘ శ్రేష్ఠ హేషాధ్వనుల్,
వరవీ రోత్కట సింహ నాదములు, దుర్వారాగ్ని శస్త్రోత్కరో
ద్ధుర శబ్దప్రవహంబులున్, సయిపఁగా దుస్సాధముల్ మాదృశా
తిరథేంద్రాళికి; నైజభీరువవు, పొత్తీ! యెట్లు నీ కోర్వనౌ?

౩౩

నెలపదినాళ్లకు వచ్చుం ను
రల నౌరోజు తిరునాళ్లు, ప్రాణేశ్వరి! త
త్సలలిత మహోత్సవాలను
బొలుపొప్పఁగ సలుపవలయు; ముందుగవత్తున్.

౩౪

వంతలఁ బాఱఁగఁ ద్రోలుచుఁ
గాంతా! సెలవిచ్చి నన్నుఁ గదనావనికిన్
సంతోషముతోఁ బంపుము !
యంతయు శుభమా'' నటంచు నధిపుఁడు పలుకన్.

౩౫

మఱుమాటాడక జిన్నత్
వరునెడఁబాటును సహింపవలయు నటంచున్
బరువగునెల చెలికత్తెల
సరసనె కడపుదు ననుచును స్వామికిఁ బలికెన్.

౩౬

దక్షిణ దండయాత్ర జయదంబగు మార్గము లెవ్వియో, మహా
దక్షునిఁ ద ద్విపక్షుని విదారణసేయు విధాన మెద్దియో;
రక్షణకై కుమారుల బలంబుల నేయెడ నెట్లు నిల్పుటో,
వీక్షణసేయుచు న్మదిని, వేఁగె విభుండు నిశావశేషమున్.

౩౭

అలజాయాపతుల న్నిబద్ధులుగఁ జేయంజాలు మోహంపు ర
జ్జుల దార్ఢ్యంబు ఘనంబెయైన, నృపపూజ్యం డాత్మధర్మంబు ని
శ్చల దృష్టి న్బరికించి యుంటఁ ద్రుటిలో సంఛేదముం జేయఁగాఁ
గలిగెన్; మన్మథబాణ జాలముల ధాక న్వీఁక నాఁగం గనెన్.

## ౬

౧

అటు లాగ్రాపురి వీడి జిన్నతుసకుండై యొప్పు గుల్జారు సం
కటమార్గంబులఁబట్టి, దవ్వుచని, కుగ్రామంబొకం డాకడ
న్గటకాఖ్యం దనరారు దానిఁ గని, తన్మధ్యంబునందుండు ప్రా
కట జీర్ణాలయమందు రే గడపెఁ గింకర్తవ్యతా మూఢుఁడై.

౨

అన్నము నీళ్లు లేక యతఁడచ్చటనే నివసింపఁ బొచ్చె; ఆ
జిన్నతుఁగూర్చియే తపముఁ జేసెడువాని విధాన ధ్యానసం
పన్నతనుండె, నా శిథిలమందిరమే మహితాశ్రమంబుగన్,
గన్నజనాళి యాతఁడొక గాఢతపస్వి యటంచు మెచ్చఁగా.

౩

సత మాజిన్నతు లోకమోహన మహాసౌందర్యమే, రోహిణీ
పతి జ్యోత్స్నంబురుడించు నాసుదతి భావస్ఫూర్తిహాసంబె, శ్రా
వ్యతఁ బుంస్కోకిలనాద మ ట్లమరు తద్భామాకలధ్యానమే,
యతఁ డాలోచనచేయు చెప్పు డచలధ్యానంబుతో నుండెడున్.

౪

పలుకరింప నేమాటయుం బలుకకుండు;
''ఎవరు నీ, వేల యిట్లుంటి, వెఱుఁగఁ జెప్పు?''
మన్న, నూరకపరికించు; నతనిఁ గాంచి
పలువురు పలుఁదెఱంగులఁ బలికి రపుడు.

౫

ఎవ రేమన్న న్జింతన్
దవులుటయే, కొంచెమేని తనస్థితిగతు లె
య్యవియో తెల్పఁడు ; తలపోఁ
త విడువఁ; డెందఱో తలఁచిరి తబిసియెయనుచున్.

౬

పరిపక్వ ఫలమ్ము లొకఁడు
కరమర్థి న్దెచ్చియిచ్చు, గంగి మొదవుపాల్
వరభక్తి నిడు మఱియొకఁడు,
నిరసించు నతఁ డవియెల్ల నిరపేక్షకుఁడై.

౭

కతిపయ వాసరాలు జరుగంగ నతం డుపవాసనిష్ఠ క్షీ
ణతయు, మునివ్రతంబున ననారతఖేదము మాత్రమే ఫలో
న్నతు లగునంచుఁ దోఁచుట జనంబిడు భోజ్య పదార్థజాలముల్
కుతుకముతో మెసంగఁ జనెఁ గొందఱితో మితభాషలాడుచున్.

౮

దయ్యముపట్టిన వారల,
నెయ్యాధియొ వ్యాధియొ భరియించెడు వారిన్,
అయ్యా గ్రామ్యులు కొని రా,
నెయ్యముతో నతఁడు మంత్రనీరము లిచ్చున్.

౯

"జిన్నత్తుల్లా" నామం
బెన్నోసారులు లిఖించి యేయాకుననో,
చిన్నవియౌ తాయెతులం
గొన్ని వినిర్మించి యుంచి కొందఱ కిచ్చున్.

౧౦

ఒక్కొకరుజ కాయువకఁడు
చిక్కఁగఁ గన్నులనుమూసి జిన్నతుపేరిన్
లెక్కించి మూఁడుమాఱులు
తక్కక స్మరియించి భస్మతతుల నొసంగున్.

౧౧

అది యేమాయయొ యతఁ డె
య్యది డిడిన సిద్ధౌషధంబె యనున ట్లుండెన్;
బదిమందియు నతనిఁ దలఁచి
రెదలో నొకబాలయోగి యీతం డనుచున్.

౧౨

దివ్యసుందర విగ్రహ తేజమరసి
వరమనోహర కంఠ నిస్వనము వినియు
సత్త్వగుణజాత మహిమప్రశస్తి గనియు
ముగ్ధు లగుచుందు రాప్రాంతపుం జనాళి.

౧౩

కుహనాయోగభరంబుఁ బూని గడపె న్గల్లారు నిశ్చింతమై
సహనంబెంతొ వహించి పల్లెఁ బదిమాసంబుల్; ప్రజానీకముల్
రహిసంభాషణ సేయు మాటలను గర్ణాకర్ణిగా వించు నా
యహమద్పట్టణ యాత్రఁగూర్చియు నతండాలించె సంపూర్తిగన్.

౧౪

"జిన్నతుసతి వీడి మన్నీఁడు దవ్వేఁగె,
నిట్టి సమయమందె యింతిఁగనఁగ
యత్నము నొనరింతు; నల్లా కరుణయున్న
సఫలము గనరాని జతనమున్నె?

౧౫

పోఁతుటీఁగ కేని పోరాని దగుఁగాదె
రాణివాస? మెటు చొరంగ నౌనొ?
పూన్కి యెంతయేని పూనకతప్పదు,
పడఁతి గనకయున్న, బ్రతుకు సున్న."

౧౬

అని గుల్జా రొకరేయి లోకతతి నిద్రాయత్తమై యుండ న
ల్లన నావాసము వీడి కాల్నడక నాగ్రాకేఁగు పెన్మార్గముం
గని పోవందొడఁగెన్ బ్రియావదన రాకాచంద్రబింబంపు ద
ర్శన భాగ్యంబునుగాంచ యత్నములు సల్పన్పూర్ణ దీక్షామతిన్.

౧౭

అట జిన్నత్ హృదయాధినాథు నెడఁబా టావంతయు న్దోఁపకుం
డుట కంతఃపురదాసికాజనము తోడుంగాంచి, రేలెల్లఁ బా
డుటయో, యాడుటయో, పఠించుటయొ, తోట్టుంగాని రోష్నారఁబి
ల్చుట కేమాత్రముఁగోర దామెయెడఁగాలుష్యంబుగుర్తించుటన్.

౧౮

రంగ్మహాలునం దొక గోపురంబు గలదు;
దాని మీఁదియంతస్తునం గానుపించు
యమునయున్ దాని కవలితీరమునఁ బ్రజయు;
పగటి నడుమ జిన్నతునిల్చు వానిఁ గనుచు.

౧౯

యమునా తీరగత ప్రజాతతికి నాయంతస్తుపై నిల్చు రూ
పములెల్ల న్దెఱచాటులీలగనె కన్పట్టున్; వివేచింప శ
క్యముగాకుండు; నదైనఁగాని యురకే కల్యాణి దృష్టించు దృ
శ్యము లాగోపుర భాగమం, దుబుసుపుచ్చంగోరి మధ్యాహ్నముల్.

౨౦

ప్రతిదిన మొక్కవ్యక్తి దరిపై నడయాడుచు నిశ్చలోర్ధ్వ దృ
క్కతులను గోపురాంతము సదాపరికించుటఁ గాంచి దానికి
న్గత మెఱుఁగంగఁ దన్మనుజనామ విశేషములం గ్రహింపఁగాఁ
గుతుకముగల్గి జిన్న తొలకకోమలిఁ బిల్చి విధించె నిట్టులన్.

౨౧

"అద్దరిఁ బ్రత్యహం బెవఁడొ యాడటఁ జూచెడు నీయగారమున్;
తద్ద రహస్య మొప్ప, గరితా! యటవోయి యతం డెవండొ, యే
ప్రొద్దిటుచూడ నేమిటికొ, పూర్తిగ నైన మెఱింగిరమ్మ! యా
సుద్ది మతేరికం దెలుపఁ జూడకు, వైళమ పోయిరా!" యనన్.

౨౨

చిన్నరాణియాన నున్నన న్నెఱవేర్ప
దాసిపోయెనటకుఁ ద్వరితగతిని;
గోపురమ్ముఁజూచు గుజ్జారుగని "చెప్పు
మెవరొ నీవు? చూతు వెవరి?" నన్న.

౨౩

"నామరహితుఁడేను, నాముద్దు గువపిట్టఁ
బట్టి కొంచుపోయెఁ బాదుషాహ;
అల్లగోపురాన నద్ది గల దటంద్రు;
వేడ్క దానిఁజూడ వేతునిచట."

౨౪

అనవిని వాఁడువెఱ్ఱియని యామె మనమ్మున నమ్మి రాణితో
మనవి యొనర్పఁబోయె; ననుమాన మెదో హృదయమ్మునొంప వే
దనపడఁ జొచ్చె జిన్న తొలకదగ్గరచుట్టము జ్ఞప్తి కప్డురాన్
దనపనికత్తె యుత్తరవిధాన మెఱుంగ ససంభ్రమాత్మయై.

౭౫

దాసిమరలివచ్చి, "తల్లి! యవలిదరి
నున్న పురుషవర్యుఁ డొక్కదివ్య
సుందరుండు, యువకమందార మనవచ్చు;
కాని పిచ్చివాఁడుగాఁగఁ దోఁచు.

౭౬

తనదఁట, గువ్వపిట్టయఁట, ధాత్రివిభుండు గ్రహించి కొంచుపో
యెనఁట, మఱేరికి న్దొరకనీయక యీామన గోపురాగ్రమం
దునిచె నటంట, యేటిదరినుండియచూచినఁ బావురాయి ద
ర్శనమగునంట, దానికయి శ్రద్ధగ వేచెదునంట, వింటిరే!

౭౭

పిచ్చిమాటలుగా కవి వేరులగునె?
నాకు వానిఁజూచినయంత నవ్వెగాక
జాలిసైతము మదిలోనఁ జాలఁగలిగె;
అందగాఁడు, విపశ్చితుండట్లు తోఁచు."

౭౮

అని వచియించు దాసినుడులన్నియుఁ బూర్తిగ నాలకించి యా
వనిత యథార్థమెల్ల మది వ్యక్తముగాఁగఁ బితృవ్యపుత్త్రుఁడే
యని, తనయందుఁ బెన్వలపు నందుటచేత మతిభ్రమంబు గాం
చెననియు, నమ్మి దాఁపకయ చెప్పె సమస్తముఁ జేటి కల్లనన్.

౭౯

"చేటీ! పాటియగునొ నా
మాటలనుట రుజువుగాంచ మదిలో వలతే
నేటిదరికి మరలఁజనుము,
చీటియొకటి వ్రాసియిత్తుఁ జేకొనిపొమ్మా!"

౩౦

అని యోజించె నొకింతసే పెటుల వ్రాయ న్వ్యక్తమానో, విలే
ఖనపత్త్రిం బెటు లందఁజేయనగునో, కార్యానుకూలస్థితిన్
గనవెట్లో, యనుసంగతుల్; కడకు శంకన్మాని సద్బుద్ధితోఁ
దనకు న్వానికి మేలుచేకుఱఁగ సంధానించె నీవక్కణన్:—

౩౧

“కూర్మిచెల్మికాఁడ? గుల్జారుసైదోడ!
చెలియుఁ జెల్లెలునగు జిన్న తెలమిఁ
బలుసలాము లొసఁగి వ్రాయు లేఖార్థముల్:—
వింటినీదు రాక, వేడ్కఁగంటి.

౩౨

రణసంక్రీడ లొనర్పఁగాఁ జనియె మత్ప్రాణేశుఁ, డేనొక్కతెన్,
గుణకంధీ! నినుఁ బిల్వఁబంపుటకు నాకున్వీలు లేదిప్డు, నీ
ప్రణయం బెప్పుడు విస్మరింపను జుమీ, పార్థుండు రా వేగ మే
యణుమాత్రంబును గొంకకే మనవి సేయన్నేర్తు నీసంగతిన్.

౩౩

నీవిద్యా పరిపూర్ణభావమునకున్, నీసౌకుమార్యానకున్
నీవాక్చాతురికిన్, సమంచితమహా నిష్ఠాపటుత్వానకున్,
నీవైదగ్ధ్య వివేకసంపదకు క్షోణీవల్లభుం డర్హతన్
భావింపన్, బదగౌరవం బొసఁగి సంబాళింప నేఁ జూచెదన్.

౩౪

అటనము మానుమన్న, మనయయ్య మనమ్మను బెంపఁగా నదీ
తటమును వీడి యింటికి ముదమ్మున శీఘ్రమ వోపుమన్న, యెం
తటి చెలికార మొందితివో నాయెడ వెల్లడిసేయు నీదు ని
ష్పటినియమంబె, నా పలుకు పాటియొనర్చి యెడంద మార్చుకో.”

౩౫

అని లిఖించి కమ్మను దాసి కందఁజేసి
"యద్దరి కరిగినంతనే, "యయ్యగారి
పేర గుల్జార? యనితొల్తఁ బృచ్ఛఁజేసి
యౌనని యతం డనినఁగాని దీని నీకు

౩౬

ఇచ్చి మా క్షేమమొక్కటే యెఱుఁగ జెప్పు;
అంతిపురపు సంగతు లెవ్వి యాడఁబోకు,
బదులుజా బతం డిచ్చుచోఁ బట్టితెమ్ము;
జరుపవలయు నెల్ల రహస్య సంయుతముగ."

౭

౧

"ఓ ఫతీమా! యదృష్టమేమో యెఱుంగ,
మొన్నవచ్చినపిల్ల కీల్బొమ్మఁ జేసె
భరతఖండ మేలెడు సార్వభౌమునైన;
ఇంకఁ జేయరానిది దాని కేదియుండు?

౨

అంతటి సార్వభౌమునకు నర్ధశరీరయు, భారతావనీ
కాంతసపత్నియున్, విమతకంఠ విలుంఠన కార్యయుక్తవి
క్రాంతులఁ బుత్త్రకోత్తములఁగన్న మహాజనయిత్రియున్, దిగం
తాంత యశోవిశాలయు, మహామహిషీమణికూడ లోఁగెఁగా!

౩

కూటికింగూడ గతిలేని కుఱ్ఱపీన్గు
విభుఁడె తనకువశ మటంచు విఱ్ఱవీఁగు;
వత్సరమ్మైనఁ గాలేదు వచ్చియిటకుఁ
గనులు నెత్తిమీఁదికి వచ్చె ననఁగఁ దోఁచు.

౪

తనమగం డూరలేఁడని తలఁకదింత,
సవతిపిల్లల మమ్ముఁ బిలువ దొకప్డు,
తనకు నాముక్షీ యేమొ బాంధవులఁ బిల్వ?
దీనిపొగ రడంపవలె క్ష్మాజానిరాఁగ."

౫

అని రోషస్ఫార ఘతీమతోఁ బలుకుచున్ హర్మ్యపరిస్థాన మం
దమవర్తించెడు చేటికాజనముతో నానంద సంచారముం
బొనరింపన్, దపుదవ్వులం దెవతెయో ప్రోష్ఠి విశేషంబనన్
జనుచుంటంగని రాదివాణపుజనుల్ సాశ్చర్యలోలాత్ములై.

౬

"క్రొత్తరాణిగారి కూర్మిచేటికయేమొ,
యెగిరియెగిరి నడచు సొగసుఁజూడ?
యమున దాఁటఁబోలు, నావంకఁ జనుచుండె;"
అనుచుఁ బలికె నొక్కయబల యపుడు

౭

ఆ మాట లాలకించి ఫ
తీమా తనయధిపురాలి తెరువునఁ జూడన్?
ఆ మానిని, "యోసీ! నీ
వామెలఁతుకఁ దెమ్మిటకు మదాజ్ఞయనంగన్.

౮

హరిణివలెఁ బరుగెత్తుచు నామెపోయి
చిన్నరాణిదాసినిఁ జేరి, "చెలియ! రమ్ము?
రోషనారాకుమారి పిల్వుమనె నిన్ను;
ఆమె సందేశ మేదియో యరసిపొమ్ము.

౯

నావిని దాసి "నే నొకఘనంబగు కార్యముమీఁద వేగమే
పోవుదు, తల్లి! యాఁగకుము, ప్రొద్దిఁక నెంతయు లేదు, క్రమ్మఱన్
రావలెఁ జీఁకటుల్ జగతిఁ గ్రమ్మకపూర్వమె, యమ్మగారి యా
జ్ఞావిధిఁదప్పఁ దప్పుదుమనంబున కూరక నొవ్వఁగూర్తుఁగా?"

౧౦

అని ముందున కేఁగంబో
యినదాని ఫతీమ చేత నెయిది గ్రహింపన్
బెనఁగినఁ బ్రయోజనము లే
దని వెఱ్ఱమరలె ఫతీమ ననుయాయినిగా.

౧౧

అల ఫతీమయన్ తంతువాయమ్ము వన్న
పట్టులోఁ బట్టువడి నిష్కపటగుణాత్మ,
చిన్నదాసి యాఁగయగుచు ఖిన్నయయ్యె,
నాత్మసందేశ వృత్తాంతమంతఁ దెలిపె.

౧౨

"దొరకిన దిన్నినాళ్ల కొక దోషము జిన్నతురాణియందుఁ, ద
త్పరికర మూఁతగాఁ గొనుచుఁ బన్నఁగవచ్చుఁ బ్రణాళికల్, హృదం
తరపరితాప మమ్మ కిఁకఁ దక్కఁగఁ జేయఁగనో" నటంచు భూ
వరసుత రోషనార పరివారముఁ బంపి ఫతీమతో ననెన్.

౧౩

"నీవును దీని వెంటఁజని నీచతురత్వము నెల్లఁజూపి, సం
భావనఁజేసి యాపడుచువాని సఖిత్వము సంగ్రహించి యే
దో వెర పూహఁజేసి కొనియుంపుము నీబసయందు; దీనికిన్
వే వరహాలు లంచమిడి వెల్లడికానటు లేర్పరింపుమా!"

౧౪

అని యాజ్ఞాపించి ఘటీ
మ ననిపి దొంగచిఱునవ్వు మానఁగఁ దోఁపన్
జినరాణిదాసిఁ గని "యో
వనితా! మెచ్చితిమి నీదువర్తన మెల్లన్.

౧౫

ఇచ్చితిమి పారితోషిక,
మెచ్చుగ నడిగితిమి చిన్నయేలికసానిన్;
వచ్చుచుఁ బోవుచు నుండుమ,
యిచ్చట నడచినది చెప్ప కెవ్వరితోడన్."

౧౬

ఇట్లనుపఁగ నా చేటిక లిర్వురుఁ గడు
సంతసముతోడ యమునాస్రవంతి దాఁటి
యవలిదరినుండు గుల్జారు నరసి, తొల్తఁ
బే రడిగి, తృప్తిపడి, యిచ్చినారు కమ్మ.

౧౭

యువకు ప్రమోదవారినిధి యొడ్డులు ద్రెంచుక పాఱఁజొచ్చెఁ దా
నవనిఁ గృతార్థుఁడైతినని, యంతముఁగాంచె సమస్త దుఃఖ భా
ర వహనకార్యజాల మని, రంతులనాడఁ దొడంగె; వాని చ
ర్య వెలుఁగుఁగొల్ప, దేవికి బిరానవచింపఁగఁ బోయె దాసియున్.

౧౮

నిలిచె ఫతీమ తత్స్థల వినిర్గతగాక, తదీయచేష్టలన్
జెలువుగఁ గాంచుచున్, నుడులఁజిత్రముగా వినుచుండ, వాఁడు నె
చ్చెలి యుపదేశ మాచరణసేయఁ బితృవ్య గృహానకేఁగఁబో
వ, లలన యడ్డమై నిలిచి వానికరంబును బట్టి యిట్లనెన్.

౧౯

యువకా! నీకుపకారము న్సలుపఁగ నుద్దేశముం గాంచితిన్;
మిపులంగూర్చెదు నీదు నెచ్చెలికి నిన్జేర్పంగ నేర్పాట్లు మా
కు వశంబుల్; హృదయాన నమ్మకము నీకుంగల్గునేన్ రమ్ము, నా
భవనంబందు రహస్య మొప్ప నిను న్భద్రంబుగా దాఁచెదన్.

౨౦

ఉపకారంబులు వేయిసల్పనగు నుద్యోగోన్నతిం గూర్చుటో,
నృపశార్దూలునిచేత బహూకృతుల వే యిప్పించుటో సల్పి; యం
తిపురానం బరపూరుషుం జొనుపుశక్తింగాంచ దుస్సాధమా;
ఇపుడా కార్యముఁ జేయఁబూనితిని నీకిష్టంబుగా నున్నచో.

౨౧

అనుమాట ల్వినినంతనే యమృత సారాప్లావముం గాంచిన
ట్లైనయంగా యువకుండు మాఱుపలు కొండేదేని రాకుండ దా
సిని వెన్నాడుచుఁబోయి యొక్క గృహముం జేరెన్; దదాజ్ఞానిబం
ధనయుక్తి న్గనుకట్టుచేఁబడెడు పెన్త్రాఁచై ప్రచారించుచున్.

౨౨

ప్రియురాలిన్ దరిసింపవచ్చునను నా విశ్వాస ముత్సాహమున్,
వియమంబుల్ నృపదాసి కూర్పఁజను న న్విస్తారమా భీతియున్,
నయగారంపు బెడందతో వెలయు నానాఁడెంపుగోవాళ్ల ని
ర్భయలీల న్వసియింపనీ కచట సంరంభస్థితిం గూర్పఁగా

౨౩

మోసకత్తె, దాసి యతని ముందఱ కరు
దెంచి, "గుల్జార! యుచితోపదేశ మిత్తు;
తూచ తప్పకుండఁగ దాని నాచరింప
నభిమతార్థ సంసిద్ధి నీ కమరునయ్య!

౨౪

నీ సౌకుమార్య గరిమన్,
నీ సౌందర్యాతిశయము, నీలావణ్యా
భాసం బొకవనితకుఁ దగు
వేసంబునకు సరిపోవు వేయి విధాలన్.

౨౫

పగలు మగవాఁడవై చరింపంగవచ్చు,
రాతురుల మాత్ర మీ వొక నాతివగుము;
వెనుకఁదీయక రమ్ము నావెంట నెటకొ;
నీదుకోర్కె ఫలించి సమ్మోద మిచ్చు.

౨౬

మాటలాడుటలో, నడయాటలోను,
అచ్చముగ నాఁడుదానవే యనఁగనుండి
చక్కఁగ నభినయింపంగఁ జాలుదు వని
నిందునమ్మక మిప్డు నా కుండెనయ్య!

౨౭

ఘనకుటుంబమునకుఁ జెందు కాంత వనియు,
విద్య లెన్నియో నేర్చిన విదుషివనియుఁ
జెలిమి సలుపఁదగిన గొప్పనెలఁతవనియుఁ
జెప్పి నీకు జిన్నతుపొత్తు సేయుదాన.

౨౮

తనుసమయాన జిన్నతుసతి దర్శనమొందుము నన్నుఁగూడి; యా
మగువకొకింతయేని ననుమానము పుట్టఁగనీక సంచరిం
పఁగ శుభమౌఁ జుమీ! వలపుఁ బట్టఁగలేక విచేష్టితంబు లే
వగపడఁజేసినం జెడు సమస్తమటంచు నెఱుంగు, బాలకా!

౨౯

పిఱికితనమ్ముజూపి బిసివోవఁ జూతేని
మరణదండన మగు మాకు, నీకు;
కడనుముట్ట నిలువఁ గల్యాణమగుఁ జుమ్మి.
ఉభయుతారక మగునోజ మనమ!

౩౦

అని గుల్జారునితో వచింప నతఁ "డమ్మా! నీవు నామేలు గో
రిన యిల్లాలవు, నమ్ము, మెన్నియిడుమ ల్పడించిన న్నీవు గీఁ
చినగీ టింతయు దాఁటనంచు మన ప్రాచీనార్యవేదంబుఁ జే
తనుగీలించిప్రమాణమున్సలుపుదున్, దాసుండఁ జుమ్మీ!" యనెన్.

౭

౧

తనజాజే పరమౌషధంబగుచు మిత్రప్రాణముల్నిల్పి యా
తని యున్మాదము మాన్పి మోదమతి సంధానంబుఁ గావించె నా
విని సంతోషము మేరమీఱి చినదేవీరత్న మిచ్చెన్ వరా
లను దానమ్ముల నాత్మచేటికి మహారాజ్ఞీ కృపాపేటికిన్.

౨

ఒక సాయంతనవేళ మత్తకరిణీ యూధంబునా జిన్నతం
బికయుం జేటికలున్ గృహోపవన వాపీకూప పద్మాకర
ప్రకరప్రాంత తలంబులన్ దిరుగుచున్ రాజీవరాజి న్దమిన్
బెకలింపన్, ద దనంగ బాణతతితో వేడ్కన్వినోదింప నొ
ద్దికఁ గ్రీడారతినుండఁగా నచటి కేతెంచె న్నవీనాంగనల్

3

ధవళపుగాగరాలు, జలతారు జరీగల పచ్చరంగు పై
టవసనముల్, బెడంగగు కడానినగల్, ధరియించు చేటికా
నివహము ముందుగా నడువ, నిక్కుచు నీల్గుచు చొయ్యారపున్నడల్
మివుల ఫతీమచేటి యొకమెల్తుకతో నరుదెంచె నాడకున్,

౪

నివ్వెఱపోయి జిన్నతట నిల్చె నెగాదిగఁ జూచుచున్; సఖుల్
దవ్వుగ నొక్కరొక్కరుగఁ దర్లఁగ, జొచ్చిరి, ''వచ్చె గొప్ప వా
రెవ్వరొ, యిందునుండఁ దగ దేమొ'' యనంజను సందియంబుచే;
అవ్వనితామణిం బరిచయం బొనరింప ఫతీమ యిట్లనెన్;

౫

చినరాణీ! విను, మీమె సైంధవనృపశ్రేష్ఠాగ్రసంతానమౌ,
మనరోష్నారకు నెయ్యురాలు, కళలం బ్రజ్ఞా విశేషంబుఁ జే
కొను నారీవరమౌక్తికంబు, నగరింగొన్నాళ్లు మాత్రంబె ని
ల్చును గానం దమ మిత్రభావమునకై చొత్తెంచె, సంధింపుఁడీ!

౬

తమ సౌజన్యము, బంధుమిత్ర జనతా ధర్మజ్ఞ భావంబు, దు
ర్దమ సౌశీల్యము, దేవతా సదృశ సౌందర్యంబు వర్ణించె మి

త్రము రోష్నార యనేకరీతులను, బ్రత్యక్షంబుగాఁ గాంచు భా
గ్యము నాకబ్బినదిప్పు" డంచని యెనూత్నాగంత్రియాకాంతయున్

౭

"అమ్మా! మీరను సద్గుణంబు లెవి నాయందుం గనన్ రావు; ని
క్కమ్మేఁ బ్రాకృతకాంతనే యగుదు; విఖ్యాతాత్మకుల్, లోకచ
క్రమ్మేల్ నాప్రభుమిత్రు నీడనగుటంగాఁబోలు సౌజన్య ము
ఖ్యమ్ముల్ నాయెడఁగాంచుచుంటిరి, నమస్కారంబు మీకుంచికిన్.

౮

అని జిన్నద్రాజ్ఞి పలుక
విని యానందించి రెల్ల విరిబోండ్లున్, ద
ద్వనితామణియు ఫతీమా
నెనసి చనియె తనయిరవున, కినుడుంగ్రుంకెన్.

౯

పద్మినులమోములు ముకుళభావమందె,
అంధతమము జగతినెల్ల వ్యాప్తిఁగాంచె,
జారచోరకుల్ చెలఁగిరి మాఱురూపు
లంది, రాజురాకకు లోకమరయు నిరతి.

౧౦

నారీరూపముతో గు
ల్జారు పలుమ అచటికివచ్చి సంభాషింపన్
ఏవో పూర్వమెఱింగిన
వారని జిన్నతుసతి మది వారకమెంచున్.

౧౧

గొంతుక నెంతగ మార్చినఁ
గాంతకు గుల్జారు పోల్కి కననగుచుండన్
జింత మునుంగును జిన్నత్
వింతగఁదోఁచుట విధాత వెడచెయిది గనన్.

౧౨

తనకై సాహసమున నొక
వనితావేషమున వాఁడు వచ్చునటంచున్
దనకీడున కదియొక సా
ధనముగ నేర్పడు నటంచుఁ దానెఱుఁగదుగా!

౧౩

తనుఁదా వెల్లడిచేసికొంచు హృదయాంతర్యంబు జిన్నత్తుతో
డనె విస్పష్టముగాఁగఁ జెల్ప నుబలాటంబొందె గుల్జారు; గీఁ
చినగీటు న్మఱి దాఁటనం చతఁడు దాసీనాయికా తల్లజం
బునకుం జేసిన వాక్ప్రదాన మొక సంభూతార్గళం బయ్యెడిన్.

౧౪

సోదరభావము మాత్రమె
నాదెస నెప్పుడు నెఱపెడు నాచెలియలి నే
మాదిరిగా వలపింతును?
పాదలియని యామె తలఁప బలుమోసమగున్.

౧౫

ఎప్పటికైనం బెండిలి
నప్పడఁతిని బడయ నొక్కొ? యని నాకుండెన్
అప్సర మాభిప్రాయం
బెప్పుడు జిన్నత్తెఱుంగ, దెట్లొకొ! యనుచున్.

౧౬

కపటదాసి యిచ్చిన భూమికా ప్రయోగ
మద్భుతముగా నెఱపఁజూచు; నంతెగాని
యతఁడు నెఱవేర్పఁజూడఁ డాత్మాశయమ్ము,
కాలము గతించె నాటకఖేలనాన.

౧౭

చక్రవర్తి, విజయ సంసిద్ధి చేకూఱ
వైభవాన నెల్లి వచ్చుననుచుఁ
బుప్పొఁదావివలె గుబుల్కొనె శుభవార్త
పురమునందు నంతిపురమునందు.

౧౮

రాజభవనాలపై జయప్రకటనమ్ము
సలుపు జండాలు, తోరణాల్ నిలిపినారు;
స్వర్ణకరదీపికా సహస్రము లునిచిరి,
కప్పురపుదివ్వె లిడిరి ప్రాకారములను.

౧౯

వింధ్యగిరిదాఁక మాత్రమే వెలయు మొగలు
రాజ్య మిప్డు గౌతమిఁ దాకఁ బ్రాఁకఁజేసి
విజయభేరితో వేంచేయు విభునిఁజూడ
గుంపుగుంపులై ప్రజలెల్లఁగూడినారు.

౨౦

స్వామికి స్వాగతంబొసఁగ సాధ్వి, మహామహిషీమతల్లి తే
జోమయ భూషణాంబర విశోభితయై తనవెంటఁ జేటికా
స్తోమము పుష్పమాలికలతో, సుమసార కరండపాళితో
దామస మాకృతి జ్జనఁగ ద్వారముచెంతను వేచియుండెడిన్,

౨౧

హృదయము రంగ్మహాలుదెస నెంతగ లాఁగినఁ గాని పాదుషా
యిదివఱకున్న పద్ధతి గమింపఁ దలంపక పెద్దరాణిదా
సదనమువంక కేఁగఁ దన సైంధవచోదకు నాజ్ఞజేసి నె
మ్మది మహిషీవతంస మభిమానముతోనిడు పూజ లందినన్.

౨౨

నాఁడచట చనిన వితరణంబు, లుత్స
వాదికములు, గౌరవము లనంతములగు;
నృపవరుఁడు తులాభారము న్వెండి పసిఁడి
నాణెములఁ దూఁగి మహితదానములు సలిపె.

౨౩

నెలమాత్రంబె వియోగమైన నది జిన్నిద్రాజ్ఞి కేఁడాదిగాఁ
దలఁపంజేయుటఁ బ్రాణభర్త విజయోత్సాహంబుమైఁ గ్రమ్మఱన్
చెలి యానందరసాబ్ధి మగ్నమతియై చెన్నొంది పాద్షాహికై
చెలులుం దాను ననుక్షణం బెదురుచూచెన్ రంగ్మహాల్ముంగిటన్,

౨౪

దిశల రాగరేఖ లలమి తేజరిల్లెఁ,
గొలఁదిసేపటికే రాజు వెలసెనచట;
చేటికాజనాభి ఖ్యోఁడుకోటి కొల్వ
జిన్నతురమణీరోహిణి చేరెఁబతిని.

౨౫

పెదరాణి మందిరంబునఁ
బొదలిన యుత్సవ విశేషము లెవియు నిచటన్
గదురకయున్నన్ జేనికి
ముద మొదవించెఁ జినరాణి ముఖదర్శనమే.

౨౬

మందహాస చంద్రికల నమందతాప,
మలరుఁజూపుఁ దూపులను మూర్ఛాతిశయము,
స్వర్గసుఖ దానకలనచే సంజ్వరమ్ము,
వరున కడఁగింపఁ జేసె నాసురుచిరాంగి.

౨౭

నాఁటి దివ్య భోజనమ్ము పాద్షా కని
ర్వాచ్యరుచి యొసంగ రసన, కతఁడు
వికసిత వదనారవిందుఁడై హాయిగాఁ
బ్రియలతాంగిఁగూడి విందుఁగుడిచె.

౨౮

"పాకరచనకై యమునాస్రవంతి జలము,
దాహమున కచ్ఛగంగా ప్రవాహ జలము,
వాడుచు సరస్వతి తనలో వఱలియుండ
నతులమౌ జేనియెడఁద ప్రయాగ గాదె?"

౨౯

అని జగన్నాథ పండితాఖ్య కవివరుఁడు
ప్రభువతంసు ప్రశస్తి వర్ణనముచేసె;
తన తులాభార కాంచన ధనమునందు
సగ మొసంగి స్వామి కవిని సత్కరించె.

30

ఆ రేయంతయు దంపతుల్ కసులమూయన్ లేదు, కందర్పుఁ డే
పార న్బాణపరంపర ల్విడువఁ బుష్పాసార వశ్యాత్ములై
వార ల్సల్పిన చుంబనాది పరిరంభ ప్రత్యయ క్రీడలన్
నేరన్ వర నసేయఁ బాఠకులకే నిష్కాంతిఁ గావించెదన్.

౯

౧

నవరోజు సమాఖ్యమహో
త్సవ దినములు మరలవచ్చె, సకలజనంబుల్
మివులఁ జలింపఁ దొడంగిరి,
రవణిల్లె మొగల్నగరు మిటారపు జోకన్.

౨

ఆబాలవృద్ధముగ ము
స్తాబై పురవీథుల జనసంఘము లలరెన్;
బాబాలనెక్కి రౌతులు,
డాబాల వరుసలపైఁ బడంతు లెసంగన్.

3

అల 'కఃష్రో' జుత్సవమున
కిలఁగల లలితాంగులెల్ల నీపురమున నే
కలయఁగ నేతెంచి రనఁగ
నలరుంబోఁడులు వెలసిరి యాతిరునాళ్లన్.

౪

తలిదండ్రులఁ దప్పి తట్టాడు పిల్లలన్
తాణాలఁజేర్పఁ గడంగువారు,
తైర్థికుల ముదుపుధనముల హరియించు
తెక్కలుల నెమకఁ దెరలువారు,
జాఱవిడిచిన భూషణరాజి చేపడ
వచ్చున న్వైరాస వరలువారు,
దాసరభాగవతంబు గారడి మొద
లైన వినోదమ్ము లరయువారు,

కం(టబడు స్త్రీలవంక నెగాదిగఁ గను
చదుగు లిడుటలోఁ దబ్బిబ్బు పడెడువారు,
వింతవింతలౌ దృశ్యము లెప్పెక్కు లమ్మ
హోత్సవదినంబుల వినోద మొదవఁజేయు.

౫

పట్ట మహిషియుం దత్పరివార జనము
బలసియుండ నడుమఁ జక్రవర్తి పొల్చు
దివ్యతేజోవిరాజిత దేహుఁ డగుచు
గ్రహసమూహాంతరాళ మార్తాండుఁ డట్లు.

౬

మారె నర్యమమండల మధ్యవర్తి
యమృతకరుఁడుగాఁ దత్పార్శ్వమందు నమరు,
నిప్డు జిన్నతురాణి రోహిణిగఁ గడమ
వారు సమ్రాజితో వట్టి తారలైరి.

౭

పటకుటీర నభస్సన న్నాభసురప్ర
భల నెసంగు నంతఃపురభామలెల్ల
తారకలు; వారినడుమ రాట్దంపతు లల
రోహిణీ సుధాంశు లధికోత్సాహ మమర.

౮

నానలేక మెలఁగు జేని తెగువఁ గాంచి
పట్టమహిషి తేటిపాటుఁ జూచు;
నం తెగాని యీసు సుంతయేని గనదు;
సవతిఁజూచి మిగుల జాలి నొందు.

౯

యాతాయాత సరోజనేత్రలఁ దదీయ వ్యాపృతీ వైఖరిన్
జేతోరంజన మొప్ప నాలుమగ లీక్షింప న్వినోదింప, ఆ
నాతు ల్దాల్చెడు వింతవింతలగు విన్నాణంపు భూషాంబర
వ్రాతంబుల్ కడు వేడ్కఁగొల్పె బహురాష్ట్రస్త్రీలు వారాటచే.

౧౦

ఆ నారీజనమధ్యమం దొక తె యొయ్యారంబుతోఁ గుల్కుచున్,
నానా చిత్రపుఁజేష్టలన్ సలుపుచున్, వాల్గన్నులం జూచుచున్,
సూనంబుల్ సవరించుకొంచుఁ బయిట న్జోద్యంబుగా దిద్దికొం
చా నాడెంపుబజారులోఁ దిరుగు టాయజ్ఞాత్మీ జిన్న ద్గనెన్.

౧౧

ఆమె తలఁచుగాఁ దనయొద్ది కరుగుఁడెంచు
క్రొత్తబిత్తరి యంచు జిన్నత్తుగనియుఁ
బతికిఁదెల్ప శంకించె నేకతమొకాని;
మఱియు వైవర్ణ్య మొందె నమ్మగువఁ గాంచ.

౧౨

"తెలతెలపోయె దేల సుదతీ! మనలంగని దప్పులందు నే
నెలఁతలు నవ్వలేదుగద? నీమది నొచ్చెడు చేష్ట లెవ్వియేన్
సలుపఁగ లేదుగా? తెలుపు చయ్యన, వారల శిక్షసేయఁగా
వలతుఁ; బవిత్రమా ప్రణయవారిధి నడ్డఁగలార లుందురా?"

౧౩

అనుచుఁ బల్కిన సార్వభౌముని నుడులకు
"నాథ! నానలే కొకచాన నడుచురీతిఁ
గాంచి సిగ్గుపడితి, నంతెగాని వింత
లేవి లే"వని చినరాణి నృపున కనియె.

౧౪

ఆ విచిత్రగమనమొందు నబల నెఱుఁగు
వారు, రోషనారా ఫతీమా రమణులు,
గుసగుసలువోవఁ జని రొక్కదెసకు నొదిఁగి;
పాప మాజిన్న తరయ దావైపు తిరిగి.

౧౫

అఘము నొనరింపఁ గృతనిశ్చయాత్మ యగుచుఁ
దెచ్చికోల్వీకాస మమర వచ్చి రోష
నార, "జనకా! నిరుటి పరిణయ మహోత్స
వ స్మృతికిఁ జిహ్నమా వేడ్క వలతు మిపుడు.

౧౬

గత సంవత్సర మీదినాన నెటు శృంగారించుకో నేర్చెనో,
క్షితినాథాగ్రణిమానసం బెటుల లక్షింపంగ వర్తించెనో,
కుతుకం బొప్పఁగ నాఁటియాకృతిని మాకు స్మీకు సమ్మోద సం
గతి చేకూర్పఁగఁ జిన్నదేవి యలరుంగాకంచుఁ బ్రార్థించెదన్.

౧౭

నాఁటి వస్త్రధారణముతో, నాఁటివర్త
నమ్ముతోఁ, బినతల్లి మోదమ్ము మీఱ
మీయెదుటఁబోవ, వలపుమై మీరు కాంచు
కథ ప్రదర్శన మొనరింత్రు గాక నేఁడు!

౧౮

అను మతమాట లెల్ల విభుఁడాదృతిమై విని, "బిడ్డ! నీ యపే
క్షను నెఱవేర్ప నెంచితిని, "సంజతజిన్ జనరాణి నీవు కో
రినవిధి వేసమూనుచుఁ జరించెదుఁగా" కని యానతిచ్చె నె
మ్మనమున మోదమొప్ప నిజమందిరమేఁగె సబాంధవంబుగా.

౧౯

నిరుఁ డీదినమునఁ దా నెవి
ధరియించెనొ యాయుడుపులఁ దాల్చుచు జిన్నత్
కర మనురాగ విలాసపు
గరిమన్ జనియె 'కుషురోజు' కార్యస్థలికిన్.

౨౦

వేఁటకాఁడు పెట్టు వెడమేఁత కాసించి
గోఁతఁగూలు లేఁడికూనలాగు
రాట్కుమారి చూపు రాగయశముఁ గోరి
యుత్సవ స్థలమున కువిడపోయె.

౨౧

జిన్నతాఖ్య హారిణిని హింసింపఁజేయ
రోషనారా మృగయురాలు త్రోలివైచె
నారిరూప మందున్న గుల్జారుపులిని
నుత్సవస్థాన గర్తముఖోర్విఁ జొరఁగ.

౨౨

మాయయు మర్మమున్గనక మానిని జిన్నతు సంతకేఁగి స్వే
చ్ఛాయతిఁ బూర్వవైఖరి విహార మొనర్చుచునుండ మారక
చ్ఛాయఁ బితృవ్యసూనుఁ డొక చక్కని చానవిధాన రూప సం
ధాయకుఁ డౌచువచ్చి కరతామరసంబునుబట్టి నవ్వుచున్.

౨౩

"చెలి! నీ దర్శన మిన్నినాళ్లకుఁ గదా చేకూరె? పాద్షాహియా
త్రలు చాలించుక వచ్చినంత సఖుల న్దర్శింపనీ కుండునా?
అలరెన్ డెందము నాకు నీ సరసనే యానందసంచారమున్
సలుపంగల్గెడు భాగ్యమబ్బుట; విలాసంబొప్ప రా ర"మ్మనన్.

౨౪

"అమ్మా! సోదరి కేరళ రాజనదు; నా ప్రాణేశు నాజ్ఞావిధిన్
సమ్మానంబునఁ దీర్చు దీక్షనునికిన్ సఖ్యంబుఁ బాటింప నా
కెమ్మాడ్కిన్ సమయంబు గాదిది; కృపాదృష్టి న్నను న్వీడి పో
పొమ్మన్నన్ గుహనావధూటి చెలునవ్వుంగాంచి యీలాగనెన్.

౨౫

"సకియా! నీ వ్రతభంగము న్సలుపు కాంతు న్నేను రా లే; దొకిం
చుక నేపైనఁ ద్వదీయ సన్నిధిని సంశోభించు ముఖ్యాశయం
బకలంకంబుగ నొందితిన్; ప్రియసఖీ! యింపోవ నీవెంట నుం
ట కనుజ్ఞన్దయ సేయు" మన్న మలుమాటంబల్కె కొప్పె న్వోసన్.

౨౬

అనుమానం బెదియో ప్రపీడనము సేయన్ మానసం బొప్పకు
న్నను దాక్షిణ్యము పైకొనం గపటకాంత న్దోడ రానిచ్చె నా
చిన దేవేరియు; వార లిర్వురును జేచే కల్పికొంచేఁగఁగాఁ
గనిరా రాజకుమారియుం జెలియు సంకల్పంబు సిద్ధింపఁగా.

౨౭

అలనాఁ డెలమిన్ జిన్నత్
లలనా సుమసౌరభాతిలాలిత్యంబున్
దొలుతంగని యామోదము
దెలుపుట జ్ఞప్తిఁ గని తేఁడు తృప్తింజెందున్.

౨౮

"కన్నుల పండువయ్యెఁ గలకంఠి మనోహరరూప మిత్తఱిన్;
జిన్నతు కాంత మించు సరసీరుహ నేత్రల, నోకుమారి, నీ
వెన్నటి కేనిఁ జూపఁగలవే? లలనా మణిమాలయందు నీ
యున్నులమిన్న నిక్కముగ నౌఁజుమి నాయకరత్నరత్నమై."

౨౯

అనుమాటల్విని రోషనార "జనకా! యాలాగె కావచ్చు; నే
ననుమానింతుఁ దదీయనీతిగుణ; మే మంటేని నా చెంతనే
చనుకాంతన్గన దుష్టురాలనఁగ నా స్వాంతమ్మునందోఁచు; ఆ
వనితాత్మము నే స్తమామె;" కన దిగ్భ్రాంతింగనె న్నృపుఁడున్.

౩౦

రాట్కుమారి చెంత నిలుచు రాఁగయా ఫ
తీమ చిర్నవ్వుతో ననె; "స్వామి! చిన్న
రాణి ప్రక్కనడుచు వ్యక్తి రమణిగాదు,
పూర్ణ రసికుఁ, డొక్క పురుషపుంగవుండు.

౩౧

ఈ రహస్యమ్ముఁ బ్రకటింప నేమితప్పొ
యనుచు నిన్నాళ్లు దాఁచితి; నమ్మగారె
తమకు ననుమాన మనుటచే దాఁపకుంటి;
దేవరయె పరీక్షింపఁగాఁ దేలునిజము."

౩౨

పిడుగులువడి తన్నడఁచిన
వడువునఁ బుడమిపతి కొంతవడి రాపడియెన్;
బడఁతిని జూడఁగఁ దడఁబడె
నెడఁద; నోడువఁగ నుడులెవ్వి యెడయకయుండెన్.

౩౩

"దాసివచించు వాక్కులు యథార్థములౌనెడ నేమిసేయుదున్?
'నాసగమేను, పైయుసురు' నాఁబలుకుల్ మృషలౌచుఁబోవుకే!
వాసిగ నావ్రతంబుఁ జెఱుపంగల సుందరరూప నేవిధిన్
ద్రోసి మనంగ నేర్తు" నని ద్రోహమొనర్పఁగ డేఁడు జంకుచున్.

౩౪

కొంతతడ వేమి పల్కకే కాంత ముండె,
మరల దృష్టి విపణివీథిఁ బరపఁ దోఁచె
జిన్నతు కుహనాకాంతతోఁ జెలఁగిచనుట;
రౌద్రరసవహ్ని కనుఁగొల్మిఁ బ్రజ్వలించె.

౩౫

ఇచటి కపటనాటక మేమి యెఱుఁగ దా య
మాయికాత్మ, హరిణివలె మట్టియాడు,
మగని నలరింప నడ తెంచు సొగసునడల,
నవ్వువెన్నెలల్ ప్రసరించు నాథు డెసను.

౩౬

వీనిఁ జూచు కొలఁది విభుని కినుక రేఁగె;
కన్ను లెఱ్ఱఁజేసి పన్ను లదిమె,
కోడెకానిఁ దెలచఁ గొజ్జాల నియమించి
క్రుద్ధసర్ప మట్లు రోఁజుచుండె.

౩౭

బాణవేగానఁ బఱతెంచి వారలేఁగి
నారి రూపానఁ బోపు గుల్జారుఁ బట్టి
"అతివ! ని న్బరీక్షింప రాజాజ్ఞయయ్యె;
ర"మ్మనుచుఁ బట్టి కొంపోవ లాగిచనిరి.

౩౮

కరముకరమునం గీలించి తిరుగుకాంత
నేల యెడసేసినారలో యెఱుఁగదయ్యె;
అల దివాణంపుడేరాలఁ గలఁతదోఁప,
జిన్న తచటనే నిలిచె నిశ్చేష్టయగుచు.

౩౯

పరుగుపరుగునఁ బ్రియదాసి వచ్చె నటకు;
"అమ్మ! మోసముమోస మేయయ్యెఁ దమకు,
దోసమేదొ యారోపించి దుష్టజనము
హింససేయఁ గడఁగి రమాయికల మిమ్ము.

౪౦

రండు రంగ్మహాలున, కిందు నుండఁదగదు,
పల్లకీ నాయిత మొనర్చి వచ్చినాను;
పాపములపుట్ట, మోసపుం బనుల దిట్ట,
రోషనార మీ కేకీడు రోసినదియొ?"

౪౧

పలపలఁ గంటి కొల్కులను బాష్పకణంబుల రాల్చుచున సతీ
తిలకము జిన్న తావిపణిదేశము వీడి నృపాలుఁడుండు నా
జిలుఁగుఁ గుటీరముందరిసె; సేవక వర్గముతో, జనానతోఁ
గలిసి విభుండు కోట కరుగ న్వెని పోయిన దాత్మవాటికిన్..

# ౧౦

౧

ఆ కపటకాంత పూరుషుం డనుచుఁ జిన్న
నాఁటి నేస్తమనుచు క్షమానాథుఁ డెఱిఁగి
తోఁకఁ ద్రొక్కిన త్రాఁచునా వీఁకఁదనరి
భటుల కాజ్ఞ యిచ్చెను వాని బంది నిలుప.

౨

"అకటా! యెంతటి మోసకత్తెయిది? మాయామర్మముల్ నేర దీ
యకలంకాత్మయనంగ నాయెదుట మాయానాటకం బాడి యీ
రక నాయంతటివాని మోసము నొనర్పంబూనె; నిం కీభువిన్
బికవాణుల్ గికురింప నేరరొకో యావిశ్వేశ్వరున్ సైతమున్?

౩

ఎంతటిప్రేమ నేవిధి నటించిన దీదురితాత్మ! నన్ను ని
శ్చింతగ నీధర న్నిలిపి చిత్రపుస్వర్గము సృష్టిఁజేసి య
త్యంతసుఖంబుఁ గూర్చునది యంచుఁ దలంచితి, నంతెగాని, నా
స్వాంతమునందు నిట్టులు మహాగ్నిఁ దగుల్చునటం చెఱుంగఁగా!

౪

మేకవన్నియపులి, మే త్తేనె పూసిన
కత్తి, జిన్న తాఖ్యకాంత యనుచు
నెఱుఁగకుంటిఁ దొలుత; నిలకె స్వర్గముఁ దెచ్చు
పరమదేవత యని భ్రాంతిపడితి.

౫

ఆశలెల్ల నయ్యె నాశాశహర్మముల్;
చేఁతలెల్ల నీటివ్రాఁత లయ్యె;
పలుకులెల్ల బొల్లవడిన ములుకులయ్యె;
తలఁపు లెండుఁబూల వలపు లయ్యె.

౬

సమరావని కేమేఁగిన
సమయముఁగని మోసగాఁడు చక్కని సతిరూ
పముతో వచ్చెదునంట, య
వమతి నొనర్చుటయ కాదె పాషాపదవిన్?

౭

"ఎంతటి పాద్షా వైనన్
స్వాంతము నాయది మఱొకనిపై వసియించున్
జెంతకు రాకు" మనుచు నా
కాంత తొలుతనే వచింపఁ గడుమెచ్చనొకో?

౮

పలురీతుల్ తలపోయు చిట్టులు మొగల్ పాద్షా యగారంబులో
నలవింగాని విషాదవేదనకు లోనై తత్తఱం గాంచుచున్
జలచిత్తంబున ముందువెన్కలకు సంచారంబు గావించుచోఁ
దలలోఁ గ్రోధమహోధిదేవత హఠాత్సంపాతిమై నెక్కొనన్.

౯

కనులం గెంపులు మీఱఁ గొమ్మలు నలుదెసల్ క్రమ్మంగ వీక్షించుచున్
ఘనగంభీర నినాదమొప్ప భటులన్ రావించి, "యోరీ! విచా
రణలే కేమి విధించు శిక్ష నెఱవేర్పం బొందు శీఘ్రాన; మీ
చినరాణిం జెరసాలఁ బెట్టి యొకదాసిం జేరనీకుండుఁడీ!

౧౦

అలకొత్త్వాలి మదాజ్ఞగాఁ దెలిపిఁ సాయంవేళకుం బూర్వ మిం
దుల కేతేరఁగ నిండు, పొం డనుచుఁ గూఁతుంబిల్వ దాసీజనం
బులఁ బంపెన్; స్థిరచిత్తముంగనక భూపుండుండె మోహంపు ర
జ్జుల ఛేదింప నశక్యమంచు మదిలో జొబ్బిల్లు పెన్బాధచే.

౧౧

కంటికి నేల కొక్కఝరిగా నులివెచ్చని నీరు రాల్చి వా
ల్గంటి కపోలయుగ్మమునఁ గట్టినయట్టులు కేలుఁదమ్మిఁ పూ
జంట కదల్పకే యునిచి చాలఁగ యోజనసేయుచుండ రా
బంటులువచ్చి "యమ్మ! మిముబందినినిల్పఁగ తెనియానతో.

౧౨

తడయక నం''దనం జెలులుఁ దానును గెవ్వున నేడ్వసాఁగె; 'నీ
శుఁడు దయమాలువాఁడ? గుణశోధనఁ జేయఁగఁ జాలఁడా? నిజం
బెఱఁద గ్రహింపలేఁడ?' యని యెల్లరు నిందలొనర్చు చుండఁగా,
''పడఁతులు! వేగ యమ్మ ననుపన్వలె''నంచు భటుల్ వచింపఁగా.

౧౩

పరమేశుఁడు తనశీలముఁ
బరిశోధనఁ జేయుచుఁ దనపావిత్ర్యంబున్
ధరణికి వెల్లడి చేసెడు
వరసమయము వచ్చెననుచు భామిని నమ్మెన్.

౧౪

తన ప్రాణము తన దైవము
తన సర్వస్వంబు పతియ, తన కతఁడువినా
యెనయ్యం దగ్గది జగమునఁ
గనరాదను గట్టినమ్మిక మ్మాయమకున్.

౧౫

ఇట్టి మహాశయయుత నా
కట్టిఁడి దైవమ్ము గట్టిగా శోధింపన్
బట్టుఁదల వహించె ననం
దిట్టరె యుచిత మ్మెఱుఁగని దేవ య్యనుచున్.

౧౬

తన సౌశీల్యాతిశయము
తనఘన సత్యగుణ సంధతయు జగమునకున్
గనఁబఱుపఁ దలఁచి జిన్నత్
తన ప్రాణ త్యాగమునకుఁ దలఁకక నిల్చెన్.

౧౭

తన వైభవమున్, దనపతి
యనురాగము, తన కళా మహత్వము స్వప్నం
బునఁ గను వృత్తాంతము లని
మనమునను విరాగమూని మానిని పొలిచెన్.

౧౮

కటికవాండ్ర వెంటఁ గలఁగక నడతెంచు
గంగిగోవు భంగిఁ గొంత నడిచె;
అంతిపురపుఁ జెఱకు నధిపతి యంపిన
రాజభటులవెంట రాజస మఱి.

౧౯

జనకు నాజ్ఞ పాటించి రోష్మారవచ్చి
"త్వరపడితి వేల, తండ్రి? సవతి జననికి
బంది విధియించితంట, యిబ్బందిగాదె?
క్షమవహించుట విధిగదా క్ష్మావిభునకు?"

౨౦

అనఁగ నాలించి షాజహా ననియె నిట్లు:
"పాపపున్ క్షమాగుణమె నాలోప మమ్మ!
దాని దుశ్చర్య సాహస మ్మాను గాదె?
రాణివాసానఁ బూరుషప్రాణి రాద
టం చెఱిఁగి యెంతపన్నాగ మేర్పఱించె!

౨౧

బాహ్యరూప ముగ్ధుండనై యేహ్యమనక
యొక్క పేదకుటుంబమం దుండు నువిదఁ

గట్టికొంటి నుచిత వివేకంబు లేక
కొఱవిఁ దెచ్చుక నాతల గోఁకికొంటి.

౨౨

రత్నమని భ్రాంతిపడి నిప్పురవనుబట్టి
కండువా కొంగున న్మూట గట్టుకొంటి;
నిప్పు డొడలు కాలఁగ నిట్టు లేడ్చు చుంటి;
కూఁతురా! శాంతి యిఁక దేనిచేతఁ గల్గు?"

౨౩

తండ్రిమాట లాలించి ఖేదపడి నట్లు
నటనఁజేసి యిట్లనె రోషనార యపుడు
"సంప్రదాయ మూహింపక సలుపు పెండ్లి
జనక! యిట్టి ఫలితమే యొసంగుఁ గాదె?

౨౪

ముక్కుమొగ మెఱుంగని బీదముగుదఁ దెచ్చి
చిన్నరాణిగా నొకసారె చేసినావు;
తత్ఫల మనుభవింపక తప్పునయ్య?
కర్మఫల మను భావ్యంబెగాదె జగతి?

౨౫

కుక్క ముట్టుకొన్నదియె యీ కుండ యనక
యింటఁ బెట్టుకొనుట మన కింగితంబు;
తెమ్ము మా పినతల్లి సందియముపడక;
జనక! యిదియె నాకు మిగుల సమ్మతంబు.

౨౬

కూఁతురాడు మాటలు విన్నకొలది జేని
కలుకరేఁగి "మాపిన తల్లియగుట నిజము,
నీకు మాత్రమేగా దది నిఖిలదుర్గ
వాసులకును మాపినతల్లి వాస్తవముగ.

౨౭

అవయవపాళియం దొకటి యామయ శీర్ణము కాఁగఁ దక్కు మే
నవనముసేయ ఖండనమె యత్తటి ముఖ్యచికిత్స యాఁగదా?
అవమతి మా మొగల్ కులమునంతకుఁ దెచ్చిన భ్రష్టురాలి భై
రవవధ మొందఁ జేసెద, నిరంజన సంస్థితి వంశ మొందుతన్."

౨౮

అనఁగా విని రాట్పుత, "యో
జనకా! తొందరవలదు, విచారణ తగవా,"
నని పై కనుచున్ లోనన్
ఘనమోదముఁ గాంచు చరిగెఁ గాంతావనికిన్.

౨౯

"మనపాచిక పాఱిన దా
చినరాణి నశించి సంతసించెదు భాగ్యం
బొనఁగూడె, నమ్మ యిఁక హా
యిని మనవచ్చు సవతి పొడయే లేకుండన."

౩౦

అని ప్రియసఖితో నుడువుచుఁ
జనె రోష్నార జనయిత్రిసదనముచేరన్;
"జననీ! విడువుము నీమది
వనట; సపత్నిపిశాచి వదలెను జుమ్మా!

౩౧

ఏఁడాది యాదిగ నినుం
బీడించెడు దయ్యము భువివీడును; తల్లీ!
నేఁ డీశుభవార్తఁ దెలుపు
పోఁడిమి గూడెన్; బ్రమోదమున మనుమింకన్.

౩౨

కూఁతునుడు ల్వినంగఁ దనకుం గడువింతగఁదోఁచి "యేమి! యా
నాతి, సపత్ని పోయినద? నాథుఁ డెటుల్విడనాడఁగల్గె? దు
ర్జాతులమాయికాత్మయగు సాధ్వికి దానికి నెట్టి ద్రోహపుం
జేఁతలుఁ జేయలేదుగద? చెప్పు" మనన్ సుత తల్లి కిట్లనెన్.

౩౩

సవతిపడంతిఁ గాంచు నిముసంబుననుండియు నీదురంత దుః
ఖవనధి యేవిధింబొరలి గట్టులు త్రెంచుక పాఱుచుండెనో,
తోవచెలికానితోడ సవతుంగను నీమొగ మెట్లు విన్ననై
నవసియయుండెనో, గుఱుతునం గనఁ గుందమె కూర్చువారమై.

౩౪

నీయెడ దుఃఖముం దెలియనేర్చియె జిన్నతు సాగనంపఁగా
నేయది మార్గమంచు సత మేము గవేషణముంబొనర్పనే
దో యవకాశ మేర్పడియె; నుద్ధతిమైఁ జనుదానిఁ గారలోఁ
ద్రోయఁగ, రేపు శీర్షమును ద్రుంపఁగఁ బన్నకలెన్నివచ్చితిన్.

౩౫

అని యామూలముగా సమస్త చరితం బాదేవితోఁ జెప్పఁగా
విని, "యోసీ! దురితాత్మ! యెంతపని గావింపం దలంపూనితే!
ఘనలావణ్య నిధానమై, సుగుణ సంఘస్థానమై, సాధ్వియా
వనిత జ్జంపఁగఁబంప నీమన సెటుల్వచ్చె న్వచింపంగదే?

౩౬

అది నా కెన్నఁడు నడ్డుగా నిలువ దావంతేని; దానిం గన
న్నది నేమాత్రము లేదసూయ; సవతి న్గన్గొంటచేఁగాదు నా
కుదితంబయ్యె విషాద మా దినమునం; దోజస్సు గోల్పోయి, న
ల్వది యేండ్లేఁగిన భర్తతో మనువు పోలన్ రా దనం గుందితిన్.

౩౭

యువకవయ స్సదోసరలియున్న వరుండు, వధూవతంసమా
నవయువతీమతల్లి, మఱి నాఁడెపుఁగాఁ పురమెట్లు వీరి? క
న్న వగను దొల్త నేడ్చితిని; నాథుఁ డతీత విమోహ మగ్నుఁడై
యవనిపు ధర్మము ల్మఱవ నావలఁబొక్కితి, నంతియే సుమా!

౩౮

ఎన్నఁడు దాని యుచ్చమున కేడ్వను, దాని వినాశముంగనన్
గన్నుల కెన్నఁడు న్విడుపు గల్గదు; పాప మమాయి కాత్మ, నా
కన్నులు చల్లగాను, బదికాలము లుంటయె నాదుకోర్కి యా,
మిన్నక దానిఁజంపుటకు మేకొన; శిక్షను దప్పఁజేయుఁడీ!

౩౯

వలసిన నాధనంబుఁ బరివారజనంబు, సమస్త మిచ్చెదన్;
లలనకు శిక్ష పూర్తిగఁ దొలంపుఁడు; వే శుభవార్తఁ దెచ్చి నా
యలమట మాన్పుఁడీ; త దమలాత్మకు రక్షణసేయుచో మొగల్
కులము ప్రవృద్ధిఁగాంచు, నడఁగు న్మఱి వేరొకరీతి నైనచో.

౪౦

కటకట! చిచ్చువెట్టితిరిగా మదికూరక? నేను గారణం
బఁట యకలంక సద్గుణ సమంచిత చిత్తను సంహరింప; నే
నెటు సహింయింపనేర్తు నిలనీయపవాదము? ప్రాణశుల్క మి
చ్చుట పతికోరు నేని ననుఁజొన్పుఁడు జిన్నతుకాంతమాఱుగా.

౪౧

ప్రళయము సంభవించుఁజుఁడీ పాపపుఁ గార్యము మీరొనర్తు రేన్;
తలఁకక కుట్రలెల్లఁ బ్రభుతల్లజుతో వెలిపుచ్చి పూఁతమా
తల కొక వేతలల్ బలిగఁ దప్పక యప్పనసేయఁ జూచెదన్;
చెలులును, నీవు, నేవిధి రచింతురొ కార్యపుఁబూచి మీదెగా?

౪౨

తల్లి యట్లుపలుకఁ దనయ నివ్వెఱపోయి
కొంతవడి ఘతీమఁగూడి మంత
నమ్ము సలిపి కృతిభరమ్ముఁ బూన మదిని
నెనసి నిశ్చయించి యిట్టులనియె.

౪౩

భవదీయామలభావ మిప్పుడుగదా పట్టంగ మాకయ్యెడిన్?
నవలారత్నము జిన్నతు స్నను పమానాఁడెంపు నేర్పెల్ల భూ
ధవుఁడు న్నీపుసు మెచ్చఁ జూపెదము; తద్దండాధికార్యాళి రెం
డవదై యొప్పు నుపాయ సాధనముతోడ న్వశ్యమొందింపనా.

౪౪

వెండిచెప్పఁ బ్రయోగించి వేయిపనులు
జగతి సాధింపనౌను దుస్సాధములును;
అమ్మ! నా మెదటికి సహాయమ్ము గాఁగ
నీపసిఁడి తోడుగా, నెద్దినెగ్గ దిలను?

౪౫

అలకొత్వాలు మొదలుగ న
ఖిలాధికారులను హేమకితవుఁడె లోఁచున్;
తలఁకకు మమ్మా, పనులన్
దలక్రిందుగఁ జేయ నీదు తనయయె తగుఁగా?

౮౬

అని నుడువఁగఁ గావలసిన
ధనముల మహ్తాజి యొసఁగి తనయుని బంపెన్;
ఘనకార్యాచరణచణలఁ
దన చెలికత్తెలనుగూడి తన్వియుఁ దరలెన్.

## ౧౧

౧

జిన్నతు గుల్జారుల తల
లన్నె మనక మఱుసటి యుదయమ్మున ఛేదిం
ప న్నియమించి మొగలులకు
మన్నిఁ దున్మ త్రగజముమాడ్కి నెసంగన్.

౨

ఒక సామ్రాజ్యము నేలునేతయయి సర్వోర్వీస్థలిన్ ధర్మమున్
బ్రకటప్రక్రియ నిల్పఁదగ్గ ప్రభువే పావిత్ర్య రూపంబెయౌ
నకలంకాత్మను ధర్మపత్నిని విచారాచార మేమాత్ర మొం
దక సంఛేదమొనర్ప నాజ్ఞయిడు టాత్మద్రోహమే కాదొకో?

3

అరిషడ్వర్గము లొక్కటన్మసరి తన్నా వేళ మొందంగ భూ
వరుఁ డౌచిత్య విచారశూన్యుఁడయి యేపాపంబులే కాత్మస
చ్చరితన్ నారులమేటియౌ ప్రియసతిన్ జంపంగఁ బంపెన్; మహా
దురితంబున్ బొనరించెఁ దన్నిరయ ప్రాప్తుండయ్యె ధాత్రీస్థలిన్

౪

చెరసాలం జొర నేఁగినంతనె సతీజిన్నత్ మహాదుఃఖ సం
భరితాత్మన్ స్మృతిదప్పిరూలె; ననుకంప న్భృత్యవర్గం బొన
ర్చిరి శైత్యోపసపర్యలెన్నో; వెతపేర్మిన్ బొల్లమేయయ్యె; నె
వ్వరు సేవించిన నేమి యాత్మపతియే పాషాణ చిత్తుండుకా?

౫

మరణ శిక్షకుం దగిన యంబరములు ధరి
యింపవలసినన్ సతి యొడ లెఱుఁగకుంటఁ
బైనిఁ జుట్టఁ బెట్టిరి భృత్యపాళి వాని;
మూర్ఛ మునిఁగియే యుండె నాపూత చరిత.

౬

అంతిపురమునం జరుగు రహాస్య వధలు
యమువ కిద్దరి దుర్గంపు టావరణము
నందె, యరుణోదయమునకుముందె నడుచు;
ఈవధాక్రమం బట్టులే యేరుపడియె.

౭

అవనీనాథుని ఘోరశాసనముఁ దా నాలించి దారాప్రభుం
డవతంసంబును గాలఁ ద్రొక్కుపని ధర్మాధ్యక్షుఁడే సేయు టెం
తవమానంబని స్వీయమిత్ర కవిరాయండౌ జగన్నాథ స
త్కవితోఁ బల్కి మొగల్వినాశమునకుం గాలంబ కా నెంచుచున్.

౮

తగు మానుసులన్ జనకుని
తెగువను మాన్పఁగలవారిఁ దెరలించినఁ బె
న్వగకడలి మునింగిన యా
మొగలువిభుని దర్శనమ్మె మూఁడకపోయెన్.

౯

ఘనమూర్ఛ మునుంగుటచే
తనో, పరమేశ్వరుని యందుఁ దనమది లీనం
బొనరించుటచేతనో, యా
చిన దేవేరికిఁ దెలివియె చేకుఱ కుండెన్.

౧౦

నిదురించిన జిన్నత్సతి,
నిదురించినయట్టులుండె నిఖిలజగంబున్
మదవతిరోష్నార, చెలియు
వదలిరినగరు చెఱసాలఁ బ్రాపించుమదిన్.

౧౧

తెలతెలవాఱఁగ జొచ్చెను;
తలవరులను వెంబడిఁగొని దండియువచ్చెన్;
లలన నెటులనో వధ్య
స్థలికిం గొని చనఁగడంగు సమయము నందున్.

౧౨

మహిషీరత్నపు ముద్రిక
వహించి రోష్నార యటకువచ్చి యనె నిటుల్;
"సహజన్ములార! యీచిన
మహిషివిడువుఁ" డవల నేదొ మంతన మాడెన్.

౧౩

రాజముద్రికం గాంచియు రాకుమారి
కొల్లగా నిచ్చు స్వర్ణంబు లెల్లఁ గొనియు
వారు చెఱసాలనుండి గుల్జారుఁ దెచ్చి
వధ్యశిలయొద్ద విడిచి యావలకుఁజనిరి.

౧౪

మైమఱచియున్న జిన్నతుమహిషి నొక్క
పల్లకీనుంచి కొనిపోయి రల్లనల్ల
వధ్యశిల యొద్దికే పితృవ్యసుతుఁగూర్చ;
నిర్వర యమున దాఁటించి రేకతముగ.

౧౬

కొంచెమేన్ స్మృతి యెఱుంగ దామించుఁబోణి;
వడ్లువైవఁ బేలా లొన్వంగఁ జాలు
వేఁకి సోఁకి యీ లోకమే లేక యుండె;
నొక హకీ మేవియోమందు లొసఁగుచుండె.

౧౭

మూఁడునాళ్ల చికిత్సచే ముగుద తెలిసె;
తానొక కుటీరమందు వితర్ది పైని
పర్ణకటముపై నొంటిగాఁ బండియుంట,
చెంత గుల్జారు నిల్చుట, వింత దోఁచె.

౧౮

కారాగారములేదు, రాజభటవర్గంబుల్ గనన్ రారు, దు
ర్వారక్రోధము మూర్తిఁదాల్చెననఁ దల్వారుల్ ప్రకాశింపఁగా
పారాలిచ్చు సిఫాయిలైనఁ బొడచూపన్ రారు, దాసీజనం
బేరైనం గనుపట్ట రాపరిసరం బీక్షింప నజ్జాక్షికిన్.

౧౯

"ఇచ్చటికెట్లు వచ్చితి? మఱెవ్వరు నన్నిటఁబండఁజేసి? రీ
వెచ్చటినుండి వచ్చితివి? హీనకుటీర నివాస మేగతిన్
వచ్చెను నాకు? నీలివసనంబుల నెవ్వరు చుట్టఁబెట్టిరో?
పొచ్చెములేక చెప్పు" మనఁ బూసలు గ్రుచ్చినరీతిఁ జెప్పుచున్.

౨౦

"గతమేదో యొక స్వప్నమాయనఁగ, నోకాంతామతల్లీ! విని
ర్గతమయ్యెన్; మఱవంగనౌనది; ధరాకాంతు ల్మహాద్రోహుల
న్మతి యీనాఁటికినైన నీ కనుభవానన్ గోచరంబైనదా?
అతివా! జ్ఞప్తికిఁ దెమ్ము ప్రాఁతప్రణయానందకేళీగతుల్.

౨౧

మనమేదే నొక గ్రామమేఁగి యచటన్ మర్యాదమైఁ బేదజీ
వనముంగాంతము, రమ్ము, నీదుమహిషీభావంబుఁ బోఁద్రోలి వ
ర్థనముంగాంచెదు చిన్ననాఁటి మననేస్తంపుం బురస్కారమున్
గని దాంపత్య సుఖంబుఁగాంచ నిఁకనైనన్ సమ్మతింపంగదే!"

౨౨

అని గుల్జారన జిన్నతంబ యనివార్యక్రోధయై కాళికా
జననీ సన్నిభ రౌద్రరూపయయి మించన్ లేచి, "యోరోరి, దు
ర్జన ముఖ్యా! ప్రణయంబుపేర నను నాశంబొందఁగాఁ జేయ వ
చ్చిన దుర్మార్గుఁడవీవు; నీ దురిత మేశిక్ష న్నివారించురా?

౨౩

ఎన్నఁడు నిన్ను నాపతిగ నెంచిన పాపమునందుఁ బోతినా?
అన్నవు, నాకుఁ దోడువని యాదటఁ గాంచితిఁగాని, పాపపుం
బన్నుఁగడ ల్వొనర్చి మనుభాగ్యము సైతము కూల్తువంచు నే
నెన్నఁగనైతిరా! పశువ! హీనజనాగ్రణి వైతివేమిరా?

౨౪

జనకుని యాజ్ఞపై మహితశాస్త్రవిధిన్ గరసంగ్రహం బొన
ర్చిన పతి నాయదృష్టమున జీవనభాగ్యముతో ననామయం
బునఁ బెను పొందుచుండ నొకమూర్ఖుని నిన్నుపయామ మొందనే
ర్తునటర? చచ్చిన న్మనినఁ దొయ్యలి కాపతి చెంతనే కదా?

౨౫

అవచాటముగా నాకీ
యవమానముఁగూర్చి యింత యగడునఁ బెట్టన్
సవతికొమరితయు నీవును
గవఁగూడి యొనర్చియున్న కపటపుఁగృతియే.

౨౬

ధర్మాధర్మ విచారణంబు తమ కర్తవ్యంబ కానున్న, దు
ష్కర్మంబుల్ నిపుణంబుగాఁ గడురహస్యంబొప్పఁ ద
త్కర్మజ్ఞాన విమూఢులౌదురుగదా ధాత్రీపాలు; రాత్మేశ్వరీ
భర్మంబేఁ బొనరించు పాటిపని సల్పన్ లేరు వారీభువిన్."

౨౭

అను నుపాలంభ వాక్యంబు లాలకించి
జిన్నతునకుండు మిక్కిలి ఖిన్నుఁడగుచు
"నింక నొకసారి యీమెను హెచ్చరింతు,
నంతకును వినకున్నఁ ద్యజింతు" ననుచు,

౨౮

పడఁతీ! పృథివీశుఁడు ని
న్నడసినయది కేవలము బలిమినెయాటన్
గడు ననురాగం బాతని
యెడ నీ కునికి యరిదియని యెంచితిఁ జుమ్మా!

౨౯

అదిగా కే నీయెడ నా
యెదలోఁ బదిలించిన వలపెల్లన్ వ్రేఁగై
వదలించినఁ గాని మదికి
సదమద మొదవు ననుభీతి చాలఁగలంచున్.

౩౦

తెగువవహించితి, నటులా
మగువతనమునకు సహించి మసటును గంటిన్ ;
దగువధము విధింపఁ బడియు
నెగువకుఁ బోయితి నను మరులెంతయుఁ గలఁపన్.

౩౧

పలుకులు వేయునేల, తెలివా ? మనసారఁగఁ బ్రేమనీపయి
న్నిలిపితిఁ బాలముంచినను నీటనుముంచిన భారమంతయున్
గలికి ! వహింపు మీవె ? యనుకంపను జూపక నీవెయుందువే
నిల గతిలేదు నాకు ; సహియింపుము నీసహాపాటిదోషముల్.

౩౨

పతిపతియంచుఁ బల్వగలఁబల్కితి ; వాపతి నీకు నెంత దు
ర్గతి గలిగింపఁ బూనెనో తలంచితె ? యక్కట ! యట్టి వానితో
జత విడువంగ నేఁటికిని సమ్మతి నీయ ; విఁ కేమిసేయ నెం
చితివి ? మఱేది ముందుగతి ? చెప్పుము,'' నాపుడు జిన్నతిట్లనెన్.

౩౩

ఎవ్వఁటికీవు సోదరుఁడవే యగు ; దాత్మవిభుండ వెట్టులా ?
దన్నరనాథుఁడే సతతమా హృదయేశుఁడు నాకుఁ ; జంపఁగా
నన్ను ధరాతలంబున మనంగనుజేయ, స్వతంత్రుఁ డాతఁడే ;
అన్న ! వచింపఁబోకు మిఁక న వ్వాలపన్నుడి యెప్డు నాయెడన్.

౩౪

నాభవితవ్యమెల్లఁ బ్రియనాథు కటాక్షముఁ బట్టియుండు ; నా
కీభువిఁ బ్రాణధారణ మనిష్టముగా మది గోచరించెడున్ ;
వైభవభాగ్యభోగములపై, హితబంధు జనాళిపైఁ గళా
శోభలపై విరక్తి పొడ సూపెడు ; నేయది కాఁదలంచెనో ?

౩౬

నీతో నారాక యప
ఖ్యాతికి హేతు, వొకమూల నడఁగుట భీరు
త్వాతిశయ మనఁదగు, మహా
పాతకమగు నాత్మహత్య పరికించు నెడన్.

౩౭

నానాథు సమక్షమునకు
నే నేఁగి యథార్థ మెల్ల నెఱిఁగింతున యేన్
నానిధనముమాన్పి యితర
మానినులం జంపవచ్చు ఛాత్మవిభుఁ డలుకన్.

౩౮

ఏదిసేయఁగ నగునని నె
మ్మది నొకయించుకతడవు సమాలోచింపన్
మదిరాక్షికి హృదయమునం
దొదవె మెఱపుఁదీఁగవోలె నొకతలఁ పరుదై.

౩౯

అన్నా! పోయెద నామొగల్సభకు, నీ వత్యంతశీఘ్రంబునన్
నన్నుంబంపఁగఁ బల్లకిం గొనఁగ నాజ్ఞాపింపు, మాస్థానిలో
మన్నీఁడుండఁగ నేను జేరవలె, మ న్న్యాయావధాఖ్యానమున్
విన్నాణంబుగ నాటకంబు సలుపన్ వేడ్కయ్యెఁజుమ్మా యనన్.

౪౦

చెలియా! నాపలు కాలకింపవు; పిశాచీయుగ్మ మందుండి ని
వ్వలిగాఁ గైకొనవేచియుం టనుభవానంగాంచియుం బోవనే
వల తేన్, బొమ్మెఁకఁ బల్లకీఁ గొనుచురా వశ్యంబుగా దిప్డు; నే
నిల సన్న్యాసిని, నాకు నీచెలిమితో నేజోక్యమున్ లే దనన్.

౪౧

ఆయమమయే చని పల్లకి
బోయీలం బిలిచి వ్రేలి పుత్తడియుంగ్రం
బే యొక పల్యంకికఁ దే
నాయకముగ నీయఁ దెచ్చి రవ్వాహనమున్.

౪౨

దానిని నారోహించుచు
మానిని చనియె మొగలు విభు మందిరమునకున్ ;
దేనిఁగన కాయువకుఁ డే
కానని కడకో వెడలె బికారియవోలెన్.

# ౧౨

౧

గవుసెనమేనా నుండియు
నవగడ:మనక చినరాణి యందఱకు న్నో
మవగతముగఁ గనఁబడఁగా
జవనికనెత్తించియె ప్రభుసభకుం జనియెన్.

౨

ఆత్మమందిరాగార మం దమరియున్న
హంసతూలికా తల్పంబునం దొకండె
దీర్ఘయోజనసేయుచు న్దెండియుండె
షాజహాన్ చక్రవర్తి, ప్రశస్తకీర్తి.

౩

స్వామి హృదయవేదన మాన్ప సచివవరుఁడు
త దమలాగారముం జొచ్చి దర్శనాభి
లాషియై నిల్చియుండెఁ దలాపిదెసను;
మంత్రిఁ గూర్చుండ నియమించి స్వామివిభుండు,

౪

వేఁడి నిట్టూర్పు భరముచే వెడఁదయురము
మాటిమాటి కుబ్బంగ నేమాటలాడ
నిచ్చగింపక నృపుఁ డొకయింతతడవు
పలుకకుండి యవల మంత్రివరుని కనియె.

౫

''ఒకయేఁడాది నిలింపలోకమున నేనున్నాఁడ, దివ్యాప్సర
శ్శుకరాజంబు పురాత్త భాగ్యమునఁ జక్షుశ్శ్రోత్ర పర్వంబుగాన్
దకరా రేమియులేక దానిఁ గరబద్ధంజేసి తత్సంగతిన్
సకలంబు న్మఱపొంది నూత్నజగతీ సంచారముం గాంచితిన్.

౬

చిలుక పలుకుల కెంతయు నలరియుంటి;
పసిమి మిసిమికి సమ్మోదవశుఁడనైతి;
కులుకునడల కానంద సంకలనఁగంటి;
మురసిపోతి నిక్కముగఁ దన్ముఖముఁ గనఁగ.

౭

అట్టిశుకిని జేతులార మెడ నులిమి
పాఱవైచియుంటిఁ బాపమనక;
మంచిచెడ్డ లొక్కయించుకే నరయనే?
యోయమాత్య! యెట్టు లోర్తు?'' ననఁగ,

౮

"స్వామీ! యూరడిలుండు; దేవరది దోషం బేమి లేదిందు; ద
త్స్వామిద్రోహియె, కామరూపుఁడగు గుల్జారే, మహానాటకం
బేమో యాడఁగవచ్చి యేలికల కీయిబ్బంది చేకూర్చె; సా
ధ్వీమాణిక్యము చిన్నరాణి యిసుమంతేన్ సల్ప దేదోషమున్.

౯

ఇంచుక సేపు తాళి మనుజేంద్రులు నాఁడు విచారణంబె కా
వించినచో యథార్థగతి వెల్లడియయ్యెడి; దిట్లు పెల్లు దుః
ఖించుటకున్, సతీహనన కిల్బిష మొందుటకున్, ప్రభూత్తమా!
కొంచెమయేని కారణము కూడకయుండు నటంచు నమ్మెదన్.

౧౦

కడచినదానికి ఖేదము
పడినఁ బ్రయోజనము లేదు; ప్రభుపుల్ కొలువుం
డుఁడు తలఁచుగ; గతమున్ మఱ
పుఁ; డిదియె సలహా ప్రియసచివుం డీయఁగనొ.

౧౧

అని ప్రగ్గడపలికిన విని
మనుజేశుఁ డొకింత శాంతి మనమునఁ గనుచున్
బనియున్నను లేకున్నను
మునుకొని చని కొలువుఁగూటమునఁ గూర్చుండున్.

౧౨

మునుపు షాజహాన్ ప్రభుపు కొల్వున వెలిం గెఁ
జూడ శక్యముగాని తేజోమయుఁడగు
నట్టి మధ్యాహ్న మార్తాండునటులఁ దనరి
మొయిలుచాటు రవి యతని మోము నేఁడు.

౧౩

పాపపుఁగోపము సలుపని
దేపనియుండు? నకటా! యొకించుకయు న్నే
నోపక యుంటినిగాదే?
ఆపడఁతిని బిల్వనంపు నైన నోనర్పన్.

౧౪

ఆకర్ణాంతములై మనోహరములౌ నానేత్ర పద్మాల సొం,
పా కందర్పుని వింటినారి యన రంగా దీర్ఘ వేణీ భరం,
బా కంఠీరవ దేహమ ట్లమరు సర్వాంగాతిసౌందర్యమున్,
నాకజ్జంటకుఁ జాటు కాఁగలవొకో నా జీవముల్ కల్గఁగా?

౧౫

నేను రాని రాత్రి దానిమోము కలువ
మొగ్గగా నెయుండి, ముదముగనదు;
నన్నుఁ గన్నయంతఁ జెన్నొందు చెంగల్వ
యై వికాసమొందు నతివ మొగము.

౧౬

సూర్యదృష్టిలేని శుష్కదుర్దిన మను
బురిని నేనులేని ఖరదినంబు;
నాదు దృక్కిరణము నాతిమోమునఁబడఁ
జీఁకటింటనైనఁ జెలువు మిగులు.

౧౭

అట్టి శుద్ధ చరిత యారీతి నొరుఁగోరి
తప్పుఁబోకడలను దరలఁ గలదె?
తరలకున్న, నాఁడు గరితరూపునఁ దోఁచు
పురుషుచర్య కర్థ మరయరాదు.

౧౮

అనుచుఁదనలోనె తాఁబల్కి కొనుచుఁ, బూర్వ
పక్ష సిద్ధాంతములఁ దనవాదమునకుఁ
దానె చేసికొనుచు, షాజహాను, కాల
యాపన మొనర్చుచుండె సింహాసనమున.

౧౯

"ఇదియెట్లు చినరాణి బ్రదికి మరల వచ్చె?
శిక్ష లేదా?" యని ప్రశ్నించు వారు,
"పల్లకీలో నుండు పడఁతి జిన్న తగునా?
కాక, దయ్యమా?" యని కలఁగు వారు
"వధ్య వేషముతోనె వచ్చెడుఁ జినదేవి;
యేమి మూడినదో?" యం చెడయువారు
"పాపము! చినరాణి బ్రదికియే యున్నది;
వట్టివా దది;" యంచుఁ బలుకు వారు,

చిన్నరాణిఁ జూచినప్రజ లెన్నొవగలఁ
బల్కి రాపల్లకీ రాట్సభకుఁ జనంగ;
ఖేద, మవమాన, మలుక, యింకేదొ కలఁప
నెత్తకయ యాఁదలం జిన్న తేఁగుచుండె.

౨౦

నిలిపినారు పల్యంకిక కొలువు నెదుర
నీలిముసుఁగు దద్దుకొనుచు నెలఁతదిగియె,
ద్వారపాలకుల్ నివ్వెఱం దవ్వుచనఁగ
నెమిలిగద్దెపై పల్లన రమణియేఁగె.

౨౧

ఆస్థానమందున్న యఖిల సభ్యులు లేచి
రాశ్చర్యచకితులై యా మెఁజూచి;
కలకలధ్వను లెల్ల కడలను జెలరేఁగ
గుసగుసల్ మంత్రులం దెసఁగఁదొడఁగ;
మరణించి చినరాణి మరల నెటులువచ్చె?
నంచు ముఖ్యామాత్యుఁ డరిగె నెదుర;
ఖిన్నమనస్కుఁడై యున్న జేఁడాద్రుశ్య
ముంగాంచి విభ్రాంతి మ్రోడువాఱ;

"తండ్రి! నిధన మొందక పినతల్లి వచ్చెఁ
బూజసేయనా?" యని యువరాజు పలికె;
దెసలఁ బరికింప కానీలిముసుఁగుతోనె
తిన్నగా గద్దెవంక కే జిన్న తరిగె.

౨౨

ఏలా వచ్చితివో, ప్రియా! యిచటి? కీవిన్నాళ్లు లెందుంటివో?
నీలంపున్ముసుఁగేల తీయవు? భటుల్ నీశీర్షముం ద్రుంప కే
లీల న్నీకు విముక్తినిచ్చి? రధికారి న్ధిక్కరింపంగ వా
రేలా సాహసముం బొనర్చిరో? నిజంబెల్లం బ్రకాశింపుమా!

౨౩

అను పాద్షానుడు లాలకించి, "నరపాలా! మీభటుల్ లంచముం
గొని నన్జంపక వీడినారు; కపటిన్, గుల్జారు నన్జేర్చి యే
టిని దాటించిరి; నే మయిన్మఱచియుంటిన్ మూఁడునాళ్లోక్క పల్లెను; వైద్యంబొనరింపఁ దెల్విగని దర్శింపంగ రాఁగల్గితిన్,

౨౪

అపరాధం బొకయింత నాయెడల లేదంచు న్నివేదింప, నో
నృపవర్యా! సమయంబు చిక్కెనను నన్నిక్షింపరాదంచు వి
న్నపముంజేయఁగ నేఁగుఁదేరఁ బ్రభువా! నాశిక్ష నేనొందఁగా
నిపు డే తెంచితి, సక్రమంబుగ వధాకృత్యంబు సాగింపుఁడీ!

౨౫

అని జిన్నతన భూపుఁడు
విని హర్షాశ్చర్యఖేద విద్ధ హృదయుఁడై
"వనితా! నీమనవు లవల
వినిచెదు, ముందేఁగు వధ్యవేషము వీడన్.

౨౬

సువిచారణ మొనరించెద
నువిదా! నిన్ను క్షమియింపనుంటిఁ జనిన నా
యవివేకమునకుఁ గుందుదు
మివులఁగ; లోనికిఁ జను" మన మెలఁత యిటులనెన్.

౨౭

"సువిచారణ చేసెదరో
యవిచారతఁ దీర్పులీయ యత్నింతురో, నా
కవి జోక్యము లేనివి, యీ
భువి నిటుపై నిల్వఁగోరఁ, బోయెద దివికే.

౨౮

బలిమిని ననురావించితి
రెలమిని గూర్తురో? వరవుడమే గతియగునో
తలఁవ్రాఁ తెటులుండెనో? యని
కలఁగుచు వచ్చితిని దోల్తఁ; గాకుండె నటుల్.

౨౯

నా పాలిటి వేలుపులై
భూపులు నన్నుఁ దనియించి మోదముఁ గూర్పన్,
నాపుణ్యము పండెను, నే
నీ పృథివిఁ గృతార్థనంచు నెంచితిఁ దృప్తిన్.

౩౦

ఇరములోని గుల్మాగునం దింపుమీఱ
మెలఁగు గిల్మానుహూరులవలెనె యధిక
సౌఖ్యగరిమనుంటి మొకవసంతమెల్ల;
మనలఁజూడ దైవమునకే కనులుగుట్టె.

౩౧

అన్నము పున్నముం దెలియనట్టి యమాయికనం జెఱింగి యె
న్నెన్నియొ పన్నికల్ సలిపి రేలినవారల కూర్చుబంధులే
నన్ను హతంబొనర్ప; నరనాథులు వానిని నమ్మి సత్యమున్
గన్నడసేయుచున్ దురితకార్య మొనర్పఁగ సిద్ధమైతిరే!

౩౨

తమరే యిల నాదైవము
తమరే యేడుగడయంచుఁ దద్దయు నమ్మన్
తమరినిగా కన్యు నెఱుఁగఁ
దమయెదుటఁ ద్రికరణ శుద్ధి తనర వచింతున్.

౩౩

నన్నెఱిఁగియు, నానడవడి
తిన్నఁదనమ్మెఱిఁగి, సన్నిధికి రానీకే
కన్నులఁ జెవులనె నమ్ముచు
హృన్నయనము మూసికొంట యేఁటితగ ?" వనన్.

౩౪

''కలికీ! నీ పలుకులు ములు
కులవలె సునిశితము లౌచుఁ గూరఁగ నాఁటున్ ;
దలఁపకు మిఁక గతమును, లో
పలి కరుగు'' మటంచు ఱేఁడువలుక నతియనెన్.

౩౫

లోపలి కరుగుట, మొగలా
యీపతితోఁ గూడి మనుట, యింక నసాధ్యం
బీపాపిని, కోభూపా!
వే పనుపుఁడు నావధ నడుపింపఁగ భట్లులన్.

౩౬

నేరము లేనిదానిపయి నేరిమి గల్గెడు రాచవారు హిం
సారతి మోపినా రొకయసాధ్యపుదోషము; దానిఁ బాదుషా
వారు విచారణమ్ము సలుపం దలఁపూనక చుల్కనన్ మహా
ఘోరవధ న్విధించి; రది కూడకపోవుట యెట్టులయ్యెడున్ ?

౩౭

మానవనాథ! నాకిఁకను మాటలతోఁ బనిలేదు; నాఁటి స
మ్మానదినాలు పోయె; నవమానపు రోజులువచ్చె; శాంతిమై
వాని సహింపనేవలయు; భార్య పవిత్రత నిందనేయు న
మ్మానవులోఁడి కాఁపురము మానినికిం దగ దెంత మాత్రమున్.

౩౮

మృత్యుదేవుని హస్తమ్ము, మేదినీశ!
పట్టనుంటి ద్వితీయ వివాహకాంక్ష;
శాతఖడ్గ ప్రహారమే పూతపుష్ప
హారవుంగాన్కగా నిచ్చి యనుపుఁ'' డనిన.

౩౯

"ఉవిదా! నీ వచనంపు రీతిఁగన నీకున్మాదమే పట్టె నం
చు విచారింతుఁ, జికిత్సలం జలుప వెజ్జుల్వత్తు, రేతేరు మా
వవరోధస్థలి కిప్పుడే," యని ప్రభుండన్న న్నిరాకార దృ
ష్టి వరారోహ వహించుచుం బలికె సంకీర్ణావచూడంబయై.

౪౦

"వధమే కావలె నాకు, ద్రోహివగు, భూపాలాగ్రణీ! నీవు, నీ
దుధనంబుల్, విభవంబులున్ బరిగణింతున్ దుచ్ఛముల్గాఁగ, న
త్యధికన్యాయము రాజధర్మమున కీయంగోరి కాఁబోలు నీ
నిధనంబున్ విధియించినావు, పనిగానీ కేల యీజాలియున్?

౪౧

ఘనమైన లంచము ల్గొని నవ్యధింపక
తరలిన ఘనులు క్షంతవ్యులెగద?
చలపట్టి నాచావు దలపెట్టుకొనినట్టి
తలిరుఁబోండ్లెల్ల క్షంతవ్యలెగద?
ఆఁడువేసముతోడఁ బాడుపనికిఁ బూను
తరుణబాంధవుఁడు క్షంతవ్యుఁడెగద?
ఏ పాప మెఱుఁగక మీ పాదము లెనమ్మ
దాన నొక్కతనె హంతవ్యనగుదు,

తక్కుఁగల రాచవారు మంతవ్యులు నగు
టచ్చెరువుగాదు, రాపాడి! యమ్మచెల్ల!
యెట్టివింత తీర్పులనైన నీయఁగలదు!
వాని కెల్లఁ దొల్బలిగ నావధమెవలయు.

౪౨

ధర్మ విమర్శన దక్షులై యొప్పెడు
మంత్రీంద్రులార! నామనవి వినుఁడు.
సకలోత్తమాచార శాసకులైన సా
మంతేంద్రులార! నా మనవి వినుఁడు.
వేదశాస్త్రచయకోవిదులైన ప్రతిభాస
మంచితులార! నామనవి వినుఁడు,
ఉచితలోకానుభవోపేతులౌ బుద్ధి
మహితులారా! నాదు మనవి వినుఁడు,

కారణములేకయే యిట్టి యారడినిడి
రాణివాసాననున్న నన్ రచ్చఁబెట్టి
నిందపాల్సేసిన మగనిపొందె తగునొ
నిధనమె తగునో సేయుండు నిర్ణయంబు!

౪౩

అదిగో! పుష్పవిమానతల్లజము నాకై దేవతల్దెచ్చి నా
రది యారోహమొనర్చి స్వర్గమున కత్యానంద మొప్పార నే
గెద, స్వచ్ఛంద విహారసంకలన నాక్రీడప్రమోదంబుఁ గాం
చెద, ఱేఁడ! సెలవిచ్చిపంపుమ, యధిష్ఠింతు న్విమానంబిఁకన్.

౪౪

దేవతాకాంతలార! కరావలంబ
మిందు, మీచెంత నెక్కి కూర్చుందుదాన,
నిదిగో, వచ్చితి; హాయిహో, యెంతసుఖమొ,
స్వర్గసీమ కేతెంచు నివ్వాహయాత్ర!

౪౫

అనుచు నెమ్మిగద్దె యదుగులకడ వ్రాలి
మొగలు సార్వభౌము ముద్దుగుమ్మ,
జిన్నతమ్మ గుండె ఛిన్నమగుటచేత
నుస్సురస్సు రనుచు నుసుఱువిడిచె.

౪౬

కలఁగెన్ రాజసభామహాంబునిధి, నిర్ఘాత ప్రపాతాననాన్
జలనంబొందక రాజరాజు నిలిచెన్, సాధ్వీమహారాజ్ఞి ద
వ్వున నతఃపురసీమఁ బొల్చి భయదంపుందృశ్య మీక్షించి ని
ష్ఫలమయ్యెంగృషి; పక్షి చేపడియు మోసంబాయెనంచేడ్చెదున్

౪౭

కొలువుఁ గూటాన రేఁగిన కలకలమ్ము
కొంత శాంతింప, రారాజు సుంతదెలిసె;
మహిత గాంభీర్య సంస్థితి మసలు నతఁడు
వావిడిచి యేడ్చె నొకబేలపగిది నాఁడు.

౪౮

"ఈ యమూయిక నిర్యాణ మిట్టులగుట
మొగలుకుల నాశ సూచనమ్ముగను దోఁచు;
ఇంక రాజ్యలక్ష్మియు గతియించి నట్లె;
ఫలమదేమి యీ జీవచ్ఛవమ్ము నిలువ?

౪౯

అదిగో! తుచ్ఛపుమాంసఖండమునకై యాసించుశ్వానమ్ములన్
మదికిందెచ్చెదు పుత్త్రకుల్ ధరణికై మానాభిమానమ్ములన్
ఎడఁబాటింపక, పోరుదృశ్య మెదుటన్ దృగ్గోచరం బయ్యెడిన్
పదవీభ్రష్టతఁ గూర్చి కొంకక నను న్బంధింతు రేమో కదా!"

౫౦

అనుచుఁ బనవు షాజహాను నోదార్చిరి
మంత్రి ముఖ్యు; లస్తమయముఁ గాంచె
నినుఁడు, తమము విరిసె నెల్లహృత్సీమల;
ప్రజలఁ జూడవెఱచి రాజుడాఁగె.

౫౧

నవశిరీషకోమలము జిన్నతు తనులత
అర్హ గౌరవాన సమాధి నందునపుడు,
పట్టమహిషి మమ్తాజియే మొట్టమొదటి
పుష్పముంచె, బాష్పాంజలి పూర్వకముగ.

౫౨

తత్సమాధి దర్శించు హైందవజనాళి
నేఁటికిని జిన్నతంబా పునీతచరిత
మాలకించి, కన్నీటితో నర్పణంపు
ధర్మ మాచరింతురు తిలాతర్పణముగ.

౫౩

తమపాపాల ఫలమ్ముగా నిదుమలందం గుందువారల్, మహో
త్తములయ్యున్ బరదోష కృత్యములచేతం గష్టముల్ గాంచువా,
రమితాఘాత్ములు పెట్టు బాధలకులోనై దుఃఖముం జెందువా,
రమరన్ మూఁడు తెఱంగు; లందెవ తెయో యాజిన్నదూహింపుఁడీ!



## ముఖ్యపదాలకు అర్థాలు :—

౧ — ౭-వ పద్యము - నిర్వహణము - నిష్ఠ.

౧౭ రోకారొక్కతుల్ - బహువిధములు గలవి.

౨౩ తమిగంట్లు - పద్మములవంటి కన్నులుగలవారు, స్త్రీలు.

౨—౨ తత్ కుల్యామ్నాయ - ఆ (మహమ్మదీయ) కులమునకు హితమైన వేదముయొక్క, అనగా ఖురాన్ యొక్క.

౧౧ జల్లింపన్ - శోధింపగా.

౧౨ శీర్షకము - తలపాగా.

౨౯ అఘ్ర్యూఢ - మొదటి పెండ్లాము.

౪—౪ లతాభాండము - తీగలనెడు అలంకారము.

౧౬ తిలకాలకములు - పుట్టుమచ్చలు.

౨౪ సయ్యొద్ద - రూ. సయ్యోద్దె - చేరిక.

౩౦ ఆబాధల్ - దుఃఖములు.

౫—౮ ధ్రుపద్ - హిందూస్థానీ గానవిధానములో ఒక పద్ధతి.

౧౦ నీలకంఠ సింహాసన నిష్ఠ - నెమిలి గద్దెయందు ఉనికి.

౨౦ అతిభూమి - అతిశయము.

౬-౧౭ తొట్టున్ - మొదలు పెట్టును.

౩౨ పార్థుండు - రాజు.

౭—౯ ప్రోష్ఠి - ఎగిరి యెగిరి పడెడు మత్స్యవిశేషము.

౨౨ వియమంబుల్ - బాధలు. ౨౪ ఆభాసము - ప్రకాశము.

౮-౩౦ ప్రత్యూయ క్రీడలన్ - ప్రసిద్ధములైన ఆటలందు.

౧౦-౨౬ నిరంజన స్థితి - దోషములేని యునికి.

౧౧-౧౭ వితర్ది - అరుగు, పర్ణకటము - చాప.

౨౯ అవచాటము - అకస్మాత్తు.

౪౧ ఆయుకము - కుదువగా బెట్టు ధనము.

౧౨—౨ తెండి - పందుకొని.

౪౧ రాపాడి - రాజధర్మము. ౪౩ ఆక్రీడ - ఉద్యానవనము.

## ఈ కావ్యమందుఁ బ్రయోగించిన హిందూస్థానీ పదాలు, వాని అర్థాదులు:

నౌరోజ్—అక్బరు చక్రవర్తి కాలమునాఁటి నుండి యేఁటేఁట ఆగ్రాలో జరుగు ఉత్సవ విశేషము.

కుష్రోజ్—నౌరో జుత్సవములో స్త్రీలకోసము మాత్రమే ప్రత్యేకముగా నియమింపఁబడిన ఉత్సవదినము.

పాద్షా, పాద్షాహి—చక్రవర్తికి పర్యాయ పదాలు.

గులాము—నీచ సేవకుఁడు,

జహాపన....తురుష్క చక్రవర్తులతో భాషించు నౌకర్లు "మహాప్రభూ!" అనుటకు మారుగ ఉపయోగించు పదము.

బేగమ్—గొప్పయింటి స్త్రీ.

ముసిలిమ్, ముసల్మాన్—మహ్మదీయ పదమునకు పర్యాయ పదాలు.

నగారా—పెద్ద ఢంకా.

చిత్తనిపించు—"ఓడిపోయితిని" అని పలికించు.

జరోకాదర్శనము—మొగలుచక్రవర్తులు సామాన్యజనులకు దర్శన మిచ్చుటకు ప్రతిప్రాతఃకాలమున వచ్చి కూర్చుండు తావునకు "జరోకా" అని పేరు. ఢిల్లీలో, ఆగ్రాలోని కోటలలో ప్రవేశమందిరంపు మేడమీఁద అవి యేర్పాటు చేయఁబడియున్నవి, వానికే తెలుగున "ఉల్లడ" యని, సంస్కృతమున "వల్లభి" యని వ్యవహరింతురు.

దివానీఖాస్—ఢిల్లీ ఆగ్రా కోటలలో రహస్య మందిరములుగా మొగల్ చక్రవర్తులు కట్టించిన గొప్ప కట్టడములు.

దివానీ ఆమ్—మంత్రులతో చక్రవర్తి సమావేశమగు చోటు.

నగిషీ—చెక్కడపు పని. చక్కని లతలతో, చిత్తరువులతో అల్లికగాఁ గూర్పఁబడిన జరీకూర్పునకుఁ గూడ ఆ మాట ఉపయోగింతురు.

అత్లషు—పట్టుబట్ట, చీనాంబరము.

అహద్దీనులు } ఒకజాతి ద్వారరక్షకులు. వారు గుఱ్ఱములపై నెక్కియుండి
ఉగ్రమాలు } కోటగుమ్మాలయొద్ద పారాల నిచ్చుచుందురు.

కొజ్జాలు—రాణివాసపు కావలివాండ్రు. పుంస్త్వమును పోఁగొట్టుకొని యుండు సేవకులకుఁగూడ ఆపద ముపయోగింతురు.

బనాయించు—కల్పించు.

తాబేదారుఁడు—తక్కువ పనివాఁడు. పెద్ద ఉద్యోగి చేతిక్రింద పనిచేయు [చిన్న ఉద్యోగి.

జాగీరు—రాజు బహుమానముగా నిచ్చు భూమి.

ఖజానా—ధనాగారము.

చార్తస్లీములు—చక్రవర్తుల దర్శనమునకు వచ్చినపుడు సామంతులు నాలుగు సారులు వంగి చేయవలసిన సలాములు.

ఖామందు—యజమాని.

తకరారు—వివాదము.

నాముషీ. నామూషీ—అవమానము.

గాగరాలు—స్త్రీలుకట్టుకొను పావడలు (ఇది దేశ్యపదమే)

ముస్తాబు. ముస్తాదు—(అలంకరణాదులు ముగించి) సిద్ధమైయుండుట. లేక తగియుండుట.

హకీమ్—వైద్యుఁడు.

తల్వారుల్—ఒక విధమైన కత్తులు.

పారా (పహరా)—కావలి.

సిపాయి—కాలిబంటు.

బికారి—భిక్షకాఁడు. అప్రయోజకుఁడు (ఇది వైకృతపదము)

ఇరము-మహమ్మదీయ పురాణాలలోఁ బేర్కొనఁబడు స్వర్గమునకుమారు పేరు.

గుల్బాగు—గులాబిపూవుల తోఁట. మన నందనవనమువంటి ఆరామము.

గిర్మాను హోరులు—కిన్నెర దంపతులు, రతీమన్మథులఁబోలు దేవతల లోని భార్యాభర్తలు.

---

Renaissance Printers Ltd., T. Nagar, Madras 17

# తప్పొప్పులు

ఇందు 'ను, సు'లు, 'వు, పు'లు, 'ృ, ్ర'లును పెక్కుతావుల తారుమారుగాఁ బడినవి. అవిగాక, మఱికొన్ని తప్పులివి, వానిని దిద్దుకొనునది :—

| పుట. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 8 | ౭ | క్షాభర్త | క్ష్మాభర్త |
| | | మన్మాథాజ్ఞ | మన్నాథాజ్ఞ |
| 12 | ౧ | వాఘ్రముల | వ్యాఘ్రముల |
| 18 | ౧ | ఆగ్రాయంచు | ఆగ్రాయందు |
| 21 | ౧౪ | వేభిత్తి | లేభిత్తి |
| 22 | ౧౭ | జివ్నతు | జిన్నతు |
| 23 | ౨౬ | నంప్రీతిమై | సంప్రీతిమై |
| 31 | ౨౨ | ఆభేరీ | ఆభేరీ |
| 39 | ౨౨ | ప్రత్యహంచెవఁడో | ప్రత్యహంబెవఁడో |
| 43 | ౪ | క్షాజాని | క్ష్మాజాని |
| 46 | ౧౬ | సలుపఁగ | సలుపఁగా |
| | ౨౦ | చేత బహూకృతుల | చే బహూకృతుల |
| | ౨౨ | దరిసింపవన్చు | దరిసింపవచ్చు |
| 48 | ౨౯ | పిఱికితనమ్ము | పిఱికితనము |
| | ౧ | తనజాజే | తనజాబే |
| 49 | ౨ | మత్త కరిణీ | మ తకరిణీ |
| 53 | ౨౪ | అభిఖ్యోఁడు | అభిఖ్యోడు |
| 62 | ౩౫ | నప్వ | నవ్వ |
| 64 | ౫ | హార్మముల్ | హార్మ్యముల్ |
| 75 | ౧౨ | రత్నవు | రత్నపు |
| 76 | ౧౬ | లోన్పంగ | లోనర్పంగ |
| 79 | ౩౨ | నాపుడు | నావుడు |
| 82 | ౩ | సుంత్రి | మంత్రి |
| 92 | ౪౬ | నతఃపుర | నంతఃపుర |
| 93 | ౫౩ | జిన్నదూహింపు | జిన్నతూహింపు |

